భగ్వాన్
(ఎ. పి. యస్. భగవాన్)

శబ్దాల్ని ప్రేమిస్తూ
(1979—1991)
వచన కవితా సంపుటి

జూన్ 1992

ప్రతులకు
శ్రీమతి ఎ. వి. ఎల్. నర్సమాంబ
W/o ఎ. పి. యస్. భగవాన్
పంజావేమవరం - 534 247 లంకలకోడేరు - 534250
ప. గో. జిల్లా

మరియు

శ్రీ మాడభూషి కృష్ణప్రసాద్
టీచరు
బోళ్ళవారి వీధి - పాలకొల్లు-534 260

ముద్రణ
వీరభద్రా ప్రింటింగ్ ప్రెస్
భారతీయ స్టేట్ బ్యాంకు దరి
పాలకొల్లు - 534 260

ప్రచురణ
'కదలిక' (సారస్వత సంస్థ)
ఇంటి నెం. 16 న్యూ ఎస్. బి. ఐ. కాలనీ
పాలకొల్లు - 534 260
వారి మొదటి ప్రచురణ

వెల : రూ. 15-00

ప్రొఫెసర్ బేతవోలు రామబ్రహ్మం గారికీ

శ్రీ రావి రంగారావు కూ

శ్రీ రెంటాల శ్రీ వెంకటేశ్వరరావు కూ

శ్రీ మాడభూషి కృష్ణప్రసాదు కూ

శ్రీమతి ఎ. వి. ఎల్. నర్సమాంబ కూ

శ్రీ సిహెచ్. వామనమూర్తి కీ

శ్రీ ఆర్. లక్ష్మణరావు కూ

మరియూ

నా కవితల్ని ప్రచురిస్తూ ప్రోత్సహిస్తున్న

వివిధ పత్రికా సంపాదకులకూ

నా కృతజ్ఞతలు.

—భగ్వాన్

# ఆకాంక్ష

మిత్రులు శ్రీ భగ్వాన్‌గారు చాలాకాలంగా కవిత్వం వ్రాస్తు న్నారు. పత్రికల్లో వీరి పేరు ప్రసిద్ధమే. ఆ కవితల్ని ఏర్చికూర్చి 'శబ్దాల్ని ప్రేమిస్తూ' సంపుటీకరించారు. ఇది వీరి మొదటి ప్రచురణ. వీరి మనస్సరోవరంలో పూచిన ఈ తొలి పద్మాన్ని కన్నతల్లికి అంకితం చేసారు. ఇందుకు మనసారా అభినందిస్తున్నాను.

ఇంతవరకూ ఎవరూ స్పృశించని వస్తువు వెదికి పట్టుకుని దాని మీద కవిత రాస్తే అది పది కాలాలపాటు పాఠకులకి గుర్తుం టుంది. ఆ తరవాత అదే వస్తువుతో ఎన్ని కవితలు వచ్చినా దాని ప్రస్తావన వస్తూనే ఉంటుంది. ఇటీవల కొత్త వస్తువుల కోసం కవులలో తహతహ పెరిగింది.

వస్తువు పాతదే అయినా శిల్ప సాంద్రంగా రచించగలిగితే అదీ పది కాలాలపాటు నిలుస్తుంది. ఇది కష్టసాధ్యం. ఇక్కడ శబ్దాల కూర్పులో జాగ్రత్త తీసుకుంటే పంక్తులుకూడా పదిమంది నోళ్ళలోనూ నాన్తాయి.

ఈ రెండు కోవలకీ చెందిన కవితలు ఈ సంపుటిలో ఉన్నాయి. **అపరిచితుడు** (ఘూర్ఖా), పనిమనిషి, దాన్ని ఆదర్శం చేసుకుని (సంచి) ఇత్యాదులు మొదటి కోవలోవి. **"కాలు విరిగి అద్దం పగిలీ కళ్ళజోడూ-గూడతెగి బాగా అరిగి కాళ్ళజోడూ"**(పుట33) **"మాసినచొక్కా కన్నీటిచుక్కా"** (పుట 27) వంటివి రెండోకోవలోవి.

ప్రధానంగా వీరిది అనుభూతి కవిత్వం. "ఆర్థిక పునాదుల్నో స్వార్థాలనో" తవ్వుకుంటూవెళ్ళి అందరూ ఒకే గోడకి గుద్దుకుని నినాదమై ఆగిపోవడం వీరికి నచ్చదు. అన్నింటికీ స్పందించాలనే లక్షణం వీరి కవితలో కనిపిస్తుంది. అది వైవిధ్యాన్ని ఇచ్చింది.

ఈ సృష్టిలో ఎందుకూ పనికిరాని వస్తువు ఉండదు. ఎవ్వరికీ నచ్చని రచన ఉండదు. అలాగే అందరికీ పనికివచ్చే వస్తువూ ఉండదు. అందరూ మెచ్చేసే రచనా ఉండదు. కాలాన్నిబట్టి కూడా మెచ్చునొచ్చుల్లో మార్పులు వస్తూ ఉంటాయి. అందుకుని కవి వీటన్నింటికీ అతీతంగా ఉండాలి. తనకున్న శక్తి ఏదో తనకుంది. ఉన్నది పోదు లేనిదిరాదు. రచనావ్యాసంగం కొనసాగించడమే. 'అనగననగ రాగమతిశయించు' అన్నారు. ఇది అజ్ఞాతంగా జరిగిపోతుంది. ఈదృష్టితో కవితాకృషి సాగిస్తూ ముందడుగు వేస్తున్న శ్రీ ఖగ్వాన్‌గారిని అభినందిస్తున్నాను. వాచ్యం నుంచి వ్యంగ్యానికీ, విస్తృతి నుంచి క్లుప్తతకూ వీరి రచనాశక్తి ప్రయాణించాలని ఆకాంక్షిస్తున్నాను. వచన కవితకు శత్రువు ముమ్మాటికీ వచనమే. పద్యకవిత్వానికి శత్రువు పద్యమే. శిల్పమొక్కటే తరణోపాయం. సాధన చేయుమురా ! నరుడా !! పాట జ్ఞాపకం చేసుకుని స్వయంకృషి సాగించడమే...

బొమ్మూరు
12-5-92

- బేతవోలు రామబ్రహ్మం

# రోజూ కనపడే సంగతులే కవితా వస్తువులుగా...

సాధారణంగా కవులు చాలమంది పేరు కోసం వ్రాస్తుంటారు. కానీ కొద్దిమంది మాత్రం వ్రాయకుండా ఉండలేకపోవటం వల్ల వ్రాస్తుంటారు. అసలు వచన కవిత్వం పుట్టింది సామాన్య పాఠకులకు అర్థం కావాలని. అందుకోసం కుందుర్తి వచన కవితను వ్యావహారిక స్థాయిలో అందరికీ అర్థమయ్యేలా నడిపించారు. దీన్ని కొంతమంది సాకుగా తీసుకుని కుందుర్తి వచన కవిత్వంలో కవిత్వం పలచబడిపోయిందని విమర్శించారు. నా ఉద్దేశ్యంలో ఆ అభిప్రాయం చాలతప్పు. సరళమైన భాషలో, వ్యావహారిక రీతిలో కవిత్వం చెప్పినంతమాత్రాన అందులో గంభీరభావాలు, లోతుఉండవని అనుకోవడం పొరపాటు. మన అందరికీ తెలిసిన వేమన ఇందుకు ఉదాహరణ. వేమనను గొప్పకవిగా శ్రీశ్రీ గుర్తించడం శ్రీశ్రీ గొప్పతనాన్ని తెలియచేస్తుంది. వేమన పద్యాలలో ఎంత 'డెప్త్' ఉంటుంటో సహృదయులకు తెలియని సంగతికాదు. కానీ ఈ రోజు ఆధునికత పేరుతో వచన కవిత మరీ సంక్లిష్టంగా, అస్పష్టంగా వెర్రితలలు వేస్తున్నది. వచన కవిత పుట్టిన పరమ ప్రయోజనం దెబ్బతింటున్నది. వచన కవితలో వస్తున్న ఆధునిక పోకడలను గుర్తించలేక ఈ విమర్శ చేస్తున్నారని ఒక విమర్శ రావొచ్చు. కానీ, సాహితీ చరిత్రలో ఏ రచన అయినా అర్థం కాగలిగినప్పుడే ఆది నిలవగలుగుతుందనేది వాస్తవం.

ఇప్పుడు పత్రికలలో వస్తున్న వచన కవితలలో వైవిధ్యం చాల వుంటున్నది. ఇది హర్షించదగిన పరిణామమే. కానీ, అన్ని ధోరణులూ మంచివే అని చెప్పడానికి వీలులేదు. కొన్ని పత్రికలు, కొన్ని మంచి ధోరణులను ప్రోత్సహిస్తుంటే మరికొన్ని పత్రికలు, సంక్లిష్టధోరణులను మాత్రమే కావాలని ప్రోత్సహిస్తూ మిగిలిన ధోరణులను నిరుత్సాహపరుస్తున్నాయి. ఇలాంటి వాతావరణంలో తనకంటూ ఒక స్పష్టమైన మార్గాన్ని ఎంచుకుని, మంచి ధోరణులను పుణికిపుచ్చుకుని, కృత్రిమ ధోరణులకు దూరంగా

ఉంటూ వచన కవిత వ్రాయగలగడం చాల అరుదుగా జరిగే పని. భగ్వాన్ కవిత్వాన్ని చదువుతున్నప్పుడు నాకు ఈ మంచి లక్షణం ప్రస్ఫుటంగా కనిపిస్తున్నది.

కవిత్వం వ్రాయడం మొదలు పెట్టిన తర్వాత రెండు మూడు నెలలలోనే మంచి కవితలు వ్రాసి పెద్ద పత్రికలలోనే ప్రచురించ గలిగిన యువకులు చాల తక్కువ మంది వుంటారు. భగ్వాన్ నా కళ్ళ ముందు వ్రాయడం మొదలు పెట్టిన రెండు మూడు నెలలకే భారతి వంటి సాహిత్య పత్రికల్లో కవితలను ప్రచురించి కవితా ప్రియులను ఆకట్టుకోగలిగాడు.

గొప్పవిషయాలను గురించి కవిత్వం వ్రాయడం అంత గొప్ప తనమేమీ కాదని నా ఉద్దేశ్యం. చిన్నచిన్న వస్తువుల్ని గురించి గొప్ప భావుకతతో వ్రాయగలగడం గొప్ప రచనా లక్షణం అని నేను భావిస్తాను. 'చేతిసంచీ' మీద వ్రాసిన కవిత భగ్వాన్ మాత్రమే వ్రాయగలడనిపించేలా వ్రాసాడు. అలాగే మరో కవిత 'నా పుస్తకాల బీరువా' - ఈ కవితలో కవి వ్యక్తిత్వం, అప్యాయత, అనుభవం మనల్ని ముగ్ధుల్ని చేస్తాయి.

'నింగి నీలిమను దిద్దుకున్నంత ఎత్తుగా
పైరు పచ్చను అద్దుకున్నంత ఒత్తుగా
దేహం గదులలో కవిత్వాన్ని కప్పుకుంటుంది
నా పుస్తకాల బీరువా' -

అలాంటి బీరువా ముందు నిలబడితే 'ఎడారి ప్రయాణంలో గుక్కెడు నీళ్ళు దొరికినట్లుంటుంది' అనే వాక్యంలో కవి తపన తెలుస్తుంది. ఒక గేయం గుండె గాయాలను కడగాలని, ఒక కవిత వాస్తవం లేపనాలను రాయాలని, ఒక గీతం వేకువ దిశగా కదలికలను నేర్పాలని భగ్వాన్ ఆకాంక్ష.

భగ్వాన్ వ్రాసిన మరో మంచి కవిత అపరిచితుడు. ఈ కవిత చదివాకా రోజూ అర్ధరాత్రి మా పేటలో తిరిగే గూర్ఖా నా మనసులో మెదిలాడు. మామూలుగా మనం చూసే గూర్ఖాని కవి తన దృష్టితో చూసి ఎంతో ఉదాత్తతతో ఈ కవితలో చిత్రించాడు. మనమంతా మొద్దుగా నిద్రపోతున్నప్పుడు 'మనదారులపై తన చూపుల బలగాలను కవాతుచేయిస్తూ' మన రక్షణకోసం సైనికుడిలా నిలచే గూర్ఖాకి మనమిచ్చేది ఒకటో రెండో రూపాయలు మాత్రమే కానీ, అతని కృషిలోని ఉదాత్తత వెలకట్టలేనిది. మనిషిమీద ఎంతో ప్రేమవున్న కవి తప్ప ఇలాంటి వస్తువు మీద కవిత వ్రాయలేడు.

ఇంత చిన్న వయసులోనే భగ్వాన్ వృద్ధాప్యాన్ని గురించి తలపండిన తాత్విక దృష్టితో కవిత వ్రాయడం నేనూహించలేని విషయం, నిజమైన కవికి కావలసినదిగూడా అదే. భగ్వాన్ వృద్ధాప్యాన్ని నిర్వచిస్తూ...

'గాయాలకు చిక్కిన హృదయాన్ని
రోగాలకు దక్కిన శరీరాన్ని
జోలెగా చేసుకుని
మృత్యుదేవతను భిక్ష అడగడమే వృద్ధాప్యం'-అని అనడంలోనూ

'బలికి సిద్ధంచేసిన మేకపిల్లలా మూగవేదన అనుభవించే ప్రాణం' అని అనడంలోనూ 'పెద్దరికమూ, పెత్తనమూ, మున్ఫైఏళ్ళ ఒక సుదీర్ఘ పరిపాలనా చెప్పకుండానే చేతులు మారుతాయి' అని అనడంలోనూ కవిత్వం మనల్ని కదిలిస్తుంది. ముగింపు చూడండి ఎంత చక్కగా వ్రాసాడో.

"అమ్మ చేతి అన్నం ముద్దలూ
నాన్న ఇచ్చిన తీపి ముద్దులూ
కొడుకుల గుండెల్లో దీపాలైతే
ముసలితనం బరువూకాదు, నిద్రకరువూరాదు"...

వృద్ధాప్యంలో ఉన్న తల్లిదండ్రుల్ని కొడుకులు కంటికి రెప్పలా చూసుకోవాలని చెప్పే ఈ ముగింపువల్ల కవితకు బలం పెరిగింది. వృద్ధాప్యాన్ని ఇంత కరుణరసభరితంగా వ్రాసిన కవిత ఇటీవల కనరాదు.

మినీకవిత వ్రాయడం అనేది ఒక ప్రత్యేక నైపుణ్యం, ఎంత గొప్ప వచన కవితలు వ్రాసిన వాళ్ళైనా గొప్ప మినీ కవితలు వ్రాయాలని రూలులేదు. భగ్వాన్‌కు మినీ కవిత రచనా శిల్పం బాగాతెలుసు. 'అహం' అనే ఈ కవిత చూడండి ఈ కవితను నేను చదివి ఎన్నోసార్లు నా బి.ఇడి., విద్యార్థులకు వినిపించాను. ఇలాంటి కవితల్ని తర్వాత కొందరిచేత వ్రాయించ గలిగానుకూడా. అంత బలమైన మినీ కవిత ఇది.

'వాడు గొడ్డలితో చెట్టును నరుకుతూనే ఉన్నాడు
చెట్టు భరిస్తూనే తిరిగి చిగురేస్తోంది
వాడు భర్త! చెట్టు భార్య!
గొడ్డలి పురుషాహంకారం!

కవిత చిన్నదే అయినా ప్రతిరచనకూ వుండదగిన మంచి ప్రారంభం, మంచి కొనసాగింపు, కొసమెరుపుతో కూడిన ముగింపు ఈ కవితను ఉత్తమ కవితగా నిలుపుతున్నాయి. గొడ్డలి పురుషాహంకారం అనే సరికి అగ్గిపుల్ల వెలుతురు ఒక్కసారి మహాజ్వాలగా మారినంత గంభీరభావాన్ని మన కందిస్తుంది.

అలాగే, "పనిమనిషి" కవితలో

"ఊళ్ళో విశేషాల్ని మోసుకొచ్చే వార్తాపత్రికవుతుంది
రాత్రి గుడిముంగిట వేసిన సిన్మాకథవుతుంది" —

అని వ్రాయడంలోనూ

'సాహసి' అనే కవితలో

"ప్రదర్శన తిలకించి నాణెం విసిరే ప్రాణాలకన్నా
వ్యభిచరించిపోయే కళ్ళే ఎక్కువ"—అన్న వాక్యాల్లోనూ

'స్పర్శ' అనే కవితలో

"పిట్టల రెక్కల చప్పుళ్ళ స్పర్శతోనే చెట్లు వెలుగుతాయి"

అని చెప్పడంలోనూ

'చీకటి పువ్వు' అనే కవితలో

"గుప్పెడు కాసులకోసం గుండెడు ఊసుల్ని చంపుకున్న పువ్వు"

అని వ్యక్తీకరించడంలోనూ

'సురభి' అనే కవితలో

"పాలకులేదో చేస్తారని ప్రేక్షకులింకా వస్తారని"

అని అనగలగడంలోనూ

భగ్వాన్‌కున్న కవితాశక్తి ఏమిటో మనం అర్థంచేసుకోవచ్చు. ఇంకా "పాలిష్ వాలా, ఫీక్లీ, నిజమైన దేవుళ్ళు, గుండెల మీద చేతులు, భూతదయ..." ఇత్యాది కవితలు పాఠకుల్ని ఆకర్షిస్తాయి, అలరిస్తాయి.

ఎప్పటికప్పుడు వస్తున్న కొత్త ధోరణులలోని మంచిని గ్రహిస్తూ, సొంత శైలిని పెంపొందించుకుంటూ, మంచి కవిగా సాగుతున్న భగ్వాన్ మొదటి కవితా సంపుటి ఇది. ఇంకా ముందు ముందు మరిన్ని మంచి కావ్యాలు వ్రాస్తాడని విశ్వసిస్తూ... అభినందనలు తెలియచేస్తున్నాను.

మచిలీపట్నం
19-3-92

- రావి రంగారావు

# నా పుస్తకాల బీరువా

నింగి నీలిమను దిద్దుకున్నంత ఎత్తుగా
పైరు పచ్చను అద్దుకున్నంత ఒత్తుగా
దేహం గదులలో కవిత్వాన్ని కప్పుకుంటుంది
నా పుస్తకాల బీరువా—

పసిడి పంటను పోసిన గాదెలా
పనిముట్లను దాచిన గదిలా
కవి సమ్మేళనం కోసం
కవులలంకరించిన వేదికలా ఉంటుంది
నా పుస్తకాల బీరువా—

తలుపులు తెరుచుకోగానే
'సుగ్రంథ' సువాసన్లో తడిసిపోతాను
అరలమీంచి గుండెపొరల మీదకు
ఒక కవితా ఝరి వెల్లువవుతుంది

ఆ బీరువా ముందు నిలబడితే
ఒక అద్దం ముందు నిలుచున్నట్లుంటుంది
ఒక ప్రపంచాన్ని అందుకున్నట్లుంటుంది
నేను కోల్పోయిన రహదారులను
నా వాకిలిముందే నిలుపుకున్నట్లుంటుంది
ఎడారి ప్రయాణంలో
గుక్కెడు నీళ్ళు దొరికినట్లుంటుంది

నా బీరువా ముందు నిలబడితే
ఒక కావ్యం
నేల తడిసిన పరిమళాల్ని నిలబెడుతుంది

ఒక గేయం
గుండె గాయాలను కడుగుతుంది
ఒక కవిత
వాస్తవం లేపనాలను రాస్తుంది
ఒక గీతం
వేకువ దిశగా కదలికలను నేర్పుతుంది

వివిధ నదులు సంగమించే సముద్రంలా
నా పుస్తకాల బీరువా—
వివిధ సుమాలు వికసించే నందనంలా
నా పుస్తకాల బీరువా—

బీరువా అరల నుండి దుమికే అనుభవాలు
ప్రాణాల్ని మొలిపిస్తాయని
ఆలోచనల్ని పదునెక్కిస్తాయని
గ్రహించిన నా గుండె
నిత్యం ఆ బీరువాను తొడుక్కుంటుంది.

[25-4-91]

సురభి

నమ్ముకున్న దేన్నైనా
వదులుకుని బయటకు రావడం చాలా కష్టం.
మంచో చెడో లాభమో నష్టమో సుఖమో దుఃఖమో
అందులోనే బ్రతుకు తెల్లారిపోవడం సహజం
ఆవిడో అతడో
ఎవరైనాగానీ పేరుతో పనేమిటి ?
అందరికీ కలసి ఒకటే పేరు
ఆవిడా అతడూ
కడుపులో ఉండగానే నటులనిపించుకున్నవారు
కడుపున పడినవాళ్ళకి కూడా నటులుగా ముద్రవేసేవారు
అమ్మాయైతే రాధా సీతా
అబ్బాయైతే రాముడూ కృష్ణుడూ
పులి కడుపున పులే పుడుతుంది
నటన సరసన నటనే బతుకుతుంది
ఆహార్యాన్నే ఆహారంగా తీసుకుంటూ
అభినయాల్లోనే అనుభూతుల్ని వెతుక్కుంటూ
ఆంగికాల నుంచే ఆనందాల్ని తోడుకుంటూ
లైట్లూ మైకులూ స్క్రిప్టులూ కర్టెనులూ స్నేహితులుగా
కిరీటాలూ గిల్ట్‌నగలూ సవరాలూ చెలికత్తెలుగా
బల్లలమీద భారతాన్ని రచిస్తూనే ఉంటారు
కనుల ముందు రామకథాసుధను పోస్తూనే ఉంటారు
త్రేతాయుగాన్ని ద్వాపరయుగాన్నీ కలియుగంలో నిలబెడతారు
ముఖాని కద్దుకున్న రోజారంగు పౌడరు సాక్ష్యంగా
కడుపులో పరుగెడుతున్న ఎలుకలను పద్యాలతోనే
సముదాయించుకుంటారు
బుగ్గల కంటించుకున్న తగరపు ముక్కల తళుకుల తోడుగా

గుండెల్ని తొలిచే అవసరాల వేడిని డైలాగులతోనే ఊదుకుంటారు
గతవైభవ స్మృతులనూ అనుభూతులనూ ఆక్సిజన్ చేసుకుంటూ
పాలకులేదో చేస్తారని ప్రేక్షకులింకా వస్తారని
నటననే ఇప్పటికీ నడకగా నమ్ముకున్నవారు
కరెంటు ఉన్నా లేకున్నా కలెక్షన్ వచ్చినా రాకున్నా
లేని ధీమాతో డ్రామా ఆడక ఒప్పదు
ఆరడుగుల స్టేజినే ఆదర్శం చేసుకోక తప్పదు
మనసంతా ఓ ఖాళీ పాత్ర
ప్రతి అనుభవమూ ఓ చేదు మాత్ర
జీవన పరీక్షా పత్రంలో ఏ ప్రశ్నకైనా
నవరసాలొలికించడ మొక్కటే అక్కడ సమాధానమవుతుంది.

[18-12-91]

## క్లూ

ఎర్రబడిన రెండు కన్నుల్లోనూ నిశ్శబ్దం
కంపిస్తున్న రెండు పెదవులమధ్యా నిశ్శబ్దం
బిగించిన రెండు పిడికిళ్ళలోనూ నిశ్శబ్దం
హోరుమంటున్న రెండు చెవుల్లోనూ నిశ్శబ్దం
అర్థమవుతోంది గదూ...
అతనేదో మార్పు నాశిస్తున్నాడని. [1982]

# అపరిచితుడు

కొందరు కలల నౌకలపై విహరించే వేళ
కొందరు మొద్దు నిద్ర ఉయ్యాలూగే వేళ
కొందరు శబ్ద తుఫాన్లు ఊదే వేళ
మెలకువలా అతను
మనల్ని క్షణం పాటు తాకుతాడు
సాయంగా అతను
మనకు పారా హుషార్ని అందిస్తాడు
మన కతని పేరు తెలీదు ఊరు తెలీదు
అయినా తన కళ్ళను
మన ఇళ్ళచుట్టూ సెర్చిలైట్లను చేస్తాడు
మన కతని రంగు తెలీదు రూపు తెలీదు
అయినా తన చూపుల బలగాలను
మనదారులపై కవాతు చేయిస్తాడు
మనమెవరో అతనెవరో పరస్పరం తెలీదు
అయినా తన గొంతుతోనే
మనకు అపరాత్రి పరిచయమవుతాడు
ఒక మేలుకొలుపు పిలుపులా
మన రెప్పల్ని తెరిచే గొంతు అది
ఒక ఆత్మీయతా స్పర్శలా
మన వెన్నెముకను నిమిరే గొంతు అది
బ్రతుకు తెరువులో
బ్రతుకును బలిపెట్టేది అతని వైనం
తనవాళ్ళకు బ్రతుకు నివ్వడం కోసం
అర్ధరాత్రే అతని జీవనయానం

అతని ఇల్లెక్కడో మనం తెలుసుకోం
అతని వాళ్ళెవ్వరో మనం గుర్తించం
అతని ఆలనా పాలనా మనం పట్టించుకోం

అయినా...

తన అనుభూతుల్ని ఖండించుకుంటూ
ఏకాంతంతో దేహాన్ని ఆసాంతం తడుపుకుంటూ
నిశ్శబ్దంతో కుస్తీ పడుతూ నిశితో దోస్తీ కడుతూ
లాఠీ సౌండ్‌తోనో విజిల్‌తోనో
మన క్షేమాన్ని ప్రశ్నిస్తాడు
బిగించిన తలుపుల ఆవలినుంచి—
మనల్ని కించిత్ జాగృతం చేస్తాడు
ఒడలెరుగని నిద్ర నుంచి—
పగటి పూట మనకేమాత్రం గుర్తుకురాని
రాత్రి పూట మనమెదురైనా చూడని
మన చుట్టమూకాని మనతో స్నేహమూలేని
ఒక అపరిచిత ధైర్యశాలి
మన బ్రతుక్కి పహారా నిస్తుంటే
కన్నెత్తి కనికరించం పన్నెత్తి పలకరించం
నెలకో రూపాయి విదిల్చినప్పుడైనా
చిరునవ్వు చిలకరించం
ఏదేశం వాడో ఈదేశం వచ్చాడు
ఏ భాషకు వారసుడో మనకోసం పిల్చాడు
సరిహద్దుల్లో సైనికుడిలా మన వీథుల్లో అతడు
చీకటే చిరునామా అయినవాడు.

[17-7-91]

# వీళ్ళకి బతకడం నేర్పాలి

ఇక్కడ కొందరు బతుకుతారు
ఎదుటివాడి నడవడిలో రంధ్రాన్వేషణ చేస్తూ
పచ్చని పంటపొలాల్లాంటి మనసుల్లోకి
మురుగులా ప్రవహిస్తారు
సిగ్నల్స్‌లేని గాలివాటు ప్రయాణం చేస్తూ
నిలువెత్తు భయాలను వెన్నుకు అతుకుతారు

ఇక్కడ కొందరు బతుకుతారు
పక్కవాడి దుఃఖాల పల్లకీ బోయీలై
మాటల్ని బ్రహ్మజెముడు మొనల్ని చేస్తూ
గొంతులోనే ఊపిరికి ఉరేస్తారు
చూపుల్ని కొరివి దెయ్యాల్ని చేస్తూ
నవ్వే కళ్ళ వెనుక దిగుల్లా పఱచుకుంటారు
బతకడం ఎలాగో వీళ్ళకు చెట్టు నేర్పుతుంది

ఇక్కడ కొందరు పిశాచాలకు దణ్ణం పెడతారు
భయంతోనూ బాధతోనూ—
ఇక్కడ కొందరు దేవుళ్ళను హింసిస్తారు
నిర్దయగానూ నిర్భయంగానూ—
బతకడం ఎలాగో వీళ్ళకి నేల నేర్పుతుంది

ఇక్కడ కొందరు రైళ్ళను రేప్ చేస్తారు
ఇక్కడ కొందరు రైళ్ళను తగలేస్తారు
ఇక్కడ కొందరు రైళ్ళను రైఫిళ్ళతో కాలుస్తారు
బతకడం ఎలాగో వీళ్లకి మానవత్వం నేర్పుతుంది

బతకడమంటే కొందరు
గాలిపటంలా ఎగరడమనుకుంటారు
దారం తెగుతుందని తెలుసా...
బతకడమంటే పక్కవాడి కళ్ళల్లో వెలగడం
బతకడం ఎలాగో వీళ్లకి మబ్బు నేర్పుతుంది

బతకడమంటే కొందరు
నీళ్ళల్లో ఈదడమనుకుంటారు
సుడిగుండాలుంటాయని తెలుసా...
బతకడమంటే ఎదుటివాడి గుండెల్లో
గోపురమవడం
బతకడం ఎలాగో వీళ్ళకి బాధ్యత నేర్పుతుంది

బతకడమంటే కొందరు
కారులో షికార్లు కొట్టడమనుకుంటారు
ఆక్సిడెంట్లుంటాయని తెలుసా...
బతకడమంటే ఆలోచనలకు ఆలంబనమవడం
బతకడం ఎలాగో వీళ్ళకి లైట్ స్తంభం నేర్పుతుంది

మనిషెత్తు మౌనాలూ నిరాశలూ
మనసెత్తు భయాలూ బరువులూ
బతకడం ఎలాగో వీళ్ళకి కవిత్వం నేర్పుతుంది.

[3-7-91]

## వీక్లీ

మా పాపాయి చిరునవ్వులా
అందమైన రంగుల అట్టలు కప్పుకుని
పలురకాల సాహిత్య రసాల
సీతాకోకచిలుక రెక్కల పేజీలతో
మా ఇంట్లో హంసలా వాలుతుంది
పున్నమి చంద్రుని మీంచి జారిన
వెన్నెల కిరణాల్ని పొదుగుకున్న
కలువలైపోతాయి మా మనసులు
ఎవరో ఆత్మబంధువు చుట్టూచేరినట్లు
దాని చుట్టూ వలయమైపోతాం
మా కన్నుల సెర్చిలైట్ల కాంతిలో
దాన్ని నిలువెల్లా సోదా చేసేస్తాం
అది మా వేళ్ళ మధ్య రింగై పోతుంది
ఒప్పందం చేసుకున్న అలీన దేశాల్లా కట్టుబడిపోయి
ఒకళ్ళ తరువాత ఒకళ్ళు పంచుకుంటాం
దాని ఆగ్నేయాన్ని
మా మధ్య వేళ్ళు లాలాజలంతో ఆప్యాయిస్తాయి
మా పాపాయి కన్నులు రంగుల చిత్రాలవుతాయి
చూపులు కార్టూన్ల గిలిగింతలవుతాయి
మా బాబిగాడు రకరకాల శీర్షికలపై శీర్షాసనం వేస్తాడు
మా శ్రీమతి పెదవులు కథలై కదులుతాయి
సీరియస్‌గా సీరియల్స్సైపోతాయి
నేను ఆత్రంగా
రావి రంగారావునో వరవరరావునో
శివారెడ్డినో సినారెనో

కన్నీలబంటి మింగేస్తాను
మా చెల్లెలు మటుకు 'ఏటుజడ్' అయిపోతుంది
అది వచ్చిందన్న వైర్‌లెస్ వార్త
మా ఇంటికీ పొరుగిళ్లకూ వారధి కడుతుంది
మొహమాటం మాయమైపోయిన ముఖాలు
పలకరింపులవుతాయి చిరునవ్వుల బురఖాలుతొడుక్కుని
సాయంకాలం పూట
అమ్మలక్కల నడుమ ఎడతెగని చర్చలవుతాయి
అది మా వాడకట్టుకి కరచాలనాలిచ్చి ఇచ్చి...
భంగపాటు పాలైన మానినిలా
మా ముందు
రేకులు రాలుతున్న పువ్వైపోతుంది. [19-2-90]

## కార్మికుడు

చేతులు తన కంఠానికి
దారం ఉరితాడు
బిగించినా.
మల్లెపూవు
సురభిళాన్ని
వెదజల్లుతూనే ఉంది. [1981]

# కలానికీ కాగితానికీ స్నేహం

కలం తాకీ తాకగానే కాగితం
మనస్సరోవరంలో హంసలా వాలిపోదూ
పెదవుల పైకి పల్లకీలా ఊరేగిరాదూ
కలం నడిచీ నడవగానే కాగితం
కలల్ని మోసుకుంటూ కళ్ళల్లో వెలిగిపోదూ
తలుపుల్ని తోసుకుంటూ తలపుల్లో ఒదిగిపోదూ
కలం స్పర్శతో కాగితం బతికి బతికిస్తుంది
కలం కదలికలతో పదునెక్కిన కాగితం
ప్రశ్నించే చూపుడు వ్రేళ్ళను నిలబెడుతుంది
ఒకానొక దిక్కుతోచని సందర్భంలోనో
ఒకానొక చిక్కు సమస్య వలయంలోనో
భుజాల్ని తడుతూ వచ్చి గుండెకు జవాబు పత్రాన్నిస్తుంది
కలం ప్రసరించే చూపుల్ని అతికించుకుని కాగితం జ్వలిస్తుంది
ఆశయాల సీమలవైపు చలిస్తుంది
హృదిగదిలోని లార్వాలకు ఆలోచనల రెక్కలు తొడుగుతుంది
కలం స్రవించే ఊపిరుల్ని పీల్చుకుని కాగితం నినదిస్తుంది
జీవిత శిథిలాలనుండి గుండె ఊసుల్ని గువ్వలా ఎగరేస్తుంది
కలంతో కరచాలనం చేసిన కాగితం
పచ్చని పంటచేనులా హసిస్తూనో
దీపాలను తురుముకున్న ఆకాశంలా భాసిస్తూనో
మానవ విలువలను శ్వాసిస్తూనో
బలంగా జీవితాలను కౌగలించుకుంటుంది
అన్ని కలాలూ పదునైనవి కావు
కొన్ని చచ్చుపుచ్చు కలల్ని మేసే కలాలుంటాయి

వాటితో వరస కలిపిన కాగితం నివాసం చెత్తకుండీయే...
కొన్ని చూపు మందగించిన కలాలుంటాయి
వాటితో మాట కలిసిన కాగితం ప్రయాణం ఒంటెద్దు బండీయే
కుంటెద్దు బండీయే...
కలాన్ని తాకిన కాగితం
కోకిలలు వాలిన చెట్టై పలకరిస్తుంది
శీతగాలులు సోకిన మబ్బై చిలకరిస్తుంది
చిన్నచిన్న పాదాల దుస్తులతో
కల్తీలేని నవ్వుల అలంకారాలతో
ముస్తాబైన సాయంత్రపు బీచ్చై పులకరిస్తుంది
కలంతో దోస్తీ కట్టిన కాగితం
పిల్లల చేతుల్లో విమానమయినా
పకోడీలను మోసే పొట్లమయినా
గుండెల్లో
వెలుతురు రస్తాలను ప్రతిష్టిస్తుంది
మానవ జీవన దర్పణంలా నిలుస్తుంది
నీకో కాగితమిస్తా కలమూ ఇస్తా
బ్రతుకుల్లో విలువలను పండించు.                [22-12-89]

# చిఱునవ్వు

విరబూసిన మందారంలా ఉంటుంది చిఱునవ్వు
ఇంటి ముంగిట వేసిన
అందమైన ముగ్గులా ఉంటుంది చిఱునవ్వు
పడిన కష్టానికీ చేసిన కృషికీ
తగిన ఫలితం పొందినప్పటి
ఆత్మ సంతృప్తిలా ఉంటుంది చిఱునవ్వు

వ్యక్తిత్వం వెన్నెముక ఉసూరన్న వేళ
చిఱునవ్వు అభయ హస్తమవుతుంది
నిర్వీర్యం ముసుగు ముసురుకున్న వేళ
చిఱునవ్వు సరికొత్త ప్రాణ సమీరమవుతుంది
భయం అరికాల్లో కుమ్మరి పురుగైన వేళ
చిఱునవ్వు సాహసమవుతుంది
అలసి సొలసిన వేళ
చిఱునవ్వు ఆనందమవుతుంది
గుండెల లోతుల్లో ఆహ్లాదమవుతుంది
హృదయాలను తీవెలు తీవెలుగా
పెనవేస్తూ ఊపిరి పోస్తుంది

మృత్యువు కబళించే క్షణం
ముందుగా తెలిసిన మనిషికి
చిరునవ్వు తోడవుతుంది
ఓదార్పవుతుంది
నేస్తమవుతుంది
సమస్తమూ తానే అవుతుంది

దుఃఖం గొంతును కోస్తున్నప్పుడు
చిరునవ్వు కళ్ళకు ఆహారమవుతుంది
మౌనాన్ని మేస్తూ శూన్యమైన మనసుకు
చిరునవ్వు చైతన్య దీపమవుతుంది
నిట్టూర్పుల జ్వరానికి టానిక్కవుతుంది
ఒంటరి తనంలో విలవిలలాడే బతుక్కి
చిరునవ్వు వెలిగే జాగృద్దీపపు వత్తి
శత్రువును సైతం కట్టిపడేసే శక్తి
పెదవులపై అరగదీసిన పదునైన కత్తి

చిరునవ్వు ఓ సమ్మోహనాస్త్రం
చిరునవ్వు ఓ అనురాగ శాస్త్రం
మనసులపై పెదవులు లిఖించే
లిపిలేని మధురభావనల భాష చిరునవ్వు.

[6-1-90]

## కాలం - క్రియ

మల్లె విరిసేది - వేసవిలోనే
చామంతి మురిసేది - శీతువులోనే
మొగలి గుబాళించేది - వర్షర్తువులోనే
మనిషి రాటుదేలేది - పోరాటంలోనే. (1984)

# మొలకువ

దృశ్యాలను మింగుతూ దుఃఖాలను స్రవిస్తున్న నేత్రాలు
చూపులు విసిరినంతమేరా బతుకు రహదారి మొలుస్తుంది
పిడికిలి, గాలిలో ఊగుతున్నంతసేపూ
గమ్యం, పెదవులపై పల్లకీ అవుతుంది
జీవితపు మాధుర్యాలను దోచుకునే
రెండు ముఖాల రాక్షసుల చూపులు
మన చుట్టూ బలంగా గోడలు కడతాయి
ఆ గోడలు - మనసుల మధ్య కలతలు రేపుతాయి
భేదాభిప్రాయాల నడుమ లేచి హత్యలు చేస్తాయి
దేవుడి కళ్యాణం పందిరిలో రికార్డింగ్ డాన్సులాగ
బతుకులో మోసాలు నటిస్తాయి
మనసుకు మేకులు దిగ్గొట్టే చేతులు కరచాలనాలిస్తూ
గులాబీపూల కింద దాగిన ముళ్ళులా కసుక్కున కాటేస్తాయి
జీవితాలను తడిమే అనురాగపూరిత హస్తస్పర్శలు
కవిత్వం చెబుతాయి
నదిని కోస్తూ ముందుకు సాగే పడవలా
మౌనగర్భాన్ని చీలుస్తూ కవిత్వం గుండెలకు చూపు నిస్తుంది
ఆ చూపును గుచ్చుకున్న కన్నుల్లాగ
ఆ చూపును బిగించుకున్న పిడికిళ్ళలాగ
ఆ చూపును వెన్నెముకగా అతికించుకున్న వ్యక్తిత్వంలాగ
అప్పుడు నువ్వు నిద్రలేస్తావు. [15-3-90]

# మా ఇల్లు

ఉదయం పూట మా ఇల్లు
గంట కొట్టిన రైల్వే ప్లాట్‌ఫారమ్ అవుతుంది
చూపులతోనే గుడ్‌మార్నింగ్ చెప్పుకుంటూ
కళ్ళల్లో పరుగెత్తే సిటీ బస్సుల్ని అందుకోవడానికి
టైముతో పోటీలు జరుగుతాయి
పిల్లల్ని సముదాయిస్తూ పెద్దలకన్నీ సర్దిస్తూ
నిజంగా ఇంటావిడో సర్కస్ ఉమన్

మధ్యాహ్నం పూట మా ఇల్లు
నాలుగు ఊళ్ళ జంక్షన్‌లో నిలచిన గాంధీ బొమ్మవుతుంది
అయిన వాళ్ళందరూ వదిలేసిన అనాథలా బావురుమంటూ—
శిశిరం దెబ్బకు ఆకులు రాలిన వృక్షంలా బోసిపోతూ—
గూడు జైలులో బందీఅయిన లార్వాలా నిశ్శబ్దాన్ని మేస్తూ—

సాయంత్రం పూట మా ఇల్లు
రామకృష్ణా బీచ్ అవుతుంది
నిండా పూసిన పూలరెమ్మలా పరిమళిస్తుంది
ఆత్మీయతా స్పర్శలతో
చిలుకలు వాలిన చెట్టుకొమ్మలా సందడిస్తుంది సరదాకబుర్లతో
వేషం మార్చుకుంటుంది ఇండోర్ స్టేడియంలా...

చీకటి పడగానే మా ఇల్లు
సినిమా హాలవుతుంది
మాటా మంతీ కరువవుతుంది కళ్ళనిండా టీవీతో—
హాలుహాలంతా ఇరుకవుతుంది ఇరుగు పొరుగు జనాలతో—

రాత్రిపూట మా ఇల్లు నిద్దరోతున్నా
వేల స్వప్నాల చేతులతో పోగుచేసుకుంటూ ఉంటుంది
సరికొత్త ప్రాణసమీరాలను రేపటి బతుకుకోసం [11-6-91]

# సర్వేజనా స్సుఖినోభవంతు

చీకటి పడగానే తోడున్నానంటూ
అందంగా నువ్వొస్తావు ఆవలింతల అశ్వాలెక్కి
అమాంతం రెప్పల్ని మూసుకుని
ఆసాంతం నిన్ను నాలో కలుపుకుంటాను

శరీరం అలసినప్పుడూ
మనసు విశ్రాంతి కోరినప్పుడూ
రెప్పల దుప్పట్ల క్రింద నాతో సహజీవనం చేస్తావు
అవయవాలను స్వతంత్ర నాడీమండలం
చేతిలో పెట్టి
నేను స్వప్నలోక విహారం చేస్తాను
నా కళ్ళకు దోసిళ్ళతో
నువ్వు కడుపారా తాగించే స్వప్నాలు
జ్వలిస్తున్న శ్వాసలు అవుతాయి
భవిష్యత్తుపై ఆశలు అవుతాయి
రెప్పల సందుల్లో కూలిన దృశ్యపు శిథిలాల్లోంచి
గురిపెట్టిన బాణాలు అవుతాయి
రెప్పలు మూసుకున్న పెట్టెలో నువ్వో
ఇంద్రధనుసువి కదా !

మంచమెక్కి నా శరీరాన్ని నీ కప్పగించినప్పుడు
నేనెంత సుఖాన్ని అనుభవిస్తానని
గొంతును కోస్తున్న దుఃఖాలూ
గుండెను మరగిస్తున్న దృశ్యాలూ
అమాయకత్వాలూ అసమర్థతలూ
అనుమానాలూ అవమానాలూ
ఇవేమీ జ్ఞాపకం రానేరావు కదా !

నువ్వున్నంతసేపూ నాకీ ప్రపంచంతో పనేలేదు
నీ కౌగిలింత మత్తుగ్రోలి
ఏ దూర తీరాలకో వెళ్ళిపోతాను
రెప్పలడుగున వెలసిన నువ్వో అద్దాల మేడవు కదా!
ఏసీ దాసులనీ ఫుట్‌పాత్ వాసులనీ
నీకేమాత్రం భేదం లేదు సుమా
మాకన్నా నువ్వే నిఖార్సైన ప్రజాస్వామ్యవాదివి
మాకన్నా నువ్వే అసలు సిసలు లౌకికవాదివి
మృతానుభూతులూ మృషావిలువలూ
గుండెలనిండా శూన్యాన్ని నింపుతున్న వేళ
నిన్ను కప్పుకున్న కాసేపైనా
సర్వేజనాస్సుఖినోభవంతు
రెప్పల కింద చీకట్లో నువ్వో చంద్రహాసానివి కదా!

నువ్వావహించిన కాసేపూ
మత్తు జగత్తులో ఊరేగినా
రెప్పలు విప్పుకున్న క్షణంలో కొత్త
ఉత్సాహంతో లేస్తాను
కన్నుల్లో ఆశయాల్ని వెలిగించుకుంటూ
చూపును వజ్రాయుధం చేస్తాను
పిడికిట్లో నినాదాల్ని బిగించుకుంటూ
అడుగును వేకువ వైపు వేస్తాను. [25-6-90]

# పని మనిషి

ఆమె చిలకరించిన తొలిపిలుపు
చీకటి కారే మా ముఖాలకు మేలుకొలుపవుతూ
మా ముందు సౌఖ్యసామ్రాజ్యాన్ని నిలబెడుతుంది
రెండుపూటలా మాకు తోడవుతూ
ఇంటెడు చాకిరీని చిరునవ్వుతో జయిస్తుంది
అటునుంచి ఇటూ ఇటునుంచి అటూ
బొంగరంలా తిరుగుతూ మా తలలో నాలుకవుతుంది
మా ఇంటిముందు కల్లాపవుతుంది
రంగురంగుల రంగవల్లికలవుతుంది
మా బిందెలనిండా నీళ్ళవుతుంది
మా ఇంట్లో తళతళలాడే గిన్నెలవుతుంది
మా శరీరాలపై ఉతికిన దుస్తులవుతుంది
మా పాపాయి జడలో రిబ్బను ముడవుతుంది
కాన్వెంటుకెళ్ళే మా బాబిగాడి బాడీగార్డవుతుంది
ఊళ్లో విశేషాల్ని మోసుకొచ్చే వార్తాపత్రికవుతుంది
రాత్రి గుడి ముంగిట వేసిన సినెమా కథవుతుంది
మేం ఇచ్చే గ్లాసెడు కాఫీ తాగి
మా గుండెలలో తియ్యటి సౌజన్యమవుతుంది
మేం పెట్టే గుప్పెడు మెతుకులు తిని
మా కళ్ళల్లో స్నేహదీపమవుతుంది
ఆమె రానిరోజు...
మా కన్నుల్లో దిగులవుతుంది
మా గుండెల్లో బెంగవుతుంది
కాళ్ళకు గిన్నెలు అడ్డం పడతాయి
చేతిలో వస్తువులు పట్టుతప్పుతాయి

కుళాయిలో నీళ్ళు కంగారు పెడతాయి
మా పెదవులపై విసుగులు ముసురుతాయి
మా చూపులు చిరాకుల్ని విసురుతాయి
చేతులు విరిగినట్లో కాళ్ళు మెలిక పడినట్లో
గొప్ప ఇబ్బందై డీలా పడిపోతాం
ఆక్షణంలో...

ఆమెను పనిలోంచి తీసెయ్యాలనిపిస్తుంది
ఆరోజు జీతం కట్ చెయ్యాలనిపిస్తుంది
కానీ, తెల్లారి ఆమె చిర్నవ్వుల పలకరింపు
నిన్నటి మా అగచాట్లపై మరుపు
దుప్పటీ కప్పుతుంది
నిజానికి...

ఆమె చుట్టూ అల్లుకు పోయిన తీగలం మేము
ఆమె చేతి చలువలో ఊపిరిపీల్చే జీవులం మేము

[10-5-91]

## మృగ తృష్ణ

మితి మీరిన సంపాదనలో
ఆనందాన్ని వెతికే మనుషులు
సంపెంగ చుట్టూ మకరందానికై
తిరుగాడే పిచ్చి తుమ్మెదలు [1980]

# భూతదయ

ఒరేయ్... ఒరేయ్...
చంపకురా
అవి పావురాలు
విశ్వశాంతి చిహ్నాలు !

వద్దు... వద్దు...
వేటాడకురా
అవి లేళ్ళు
జీవహింస మహాపాపం !

చాలు... చాలు
హింసించకురా
అవి రామచిలుకలు
అహింసే మానవధర్మం !

బాబ్బాబూ
బాధించకురా
అవి కోళ్ళు
జీవకారుణ్యం పాపనాశనం !

అది కాద్సార్
వాడు తమ పదవికి అడ్డొస్తున్నాడు
అయితే
తీసెయ్ వాడితల ! [23-10-89]

# నా ఇంటి స్తంభం

నా బాల్యం నుంచీ చూస్తున్నా
ఆ స్తంభం అలా నిలబడే ఉంది
శత వసంతాల్ని చవి చూసిన
ఆ స్తంభం
ఇప్పటికీ అలా నిలబడే ఉంది!
భూమిని మోసిన ఆదిశేషునిలా
గోవర్ధనగిరి నెత్తిన గోపాలునిలా
నా ఇంటి పైకప్పుని
తల మీద కెత్తుకుని
అలా నిలబడే ఉంది !
దేశాన్ని రక్షించే వీరసైనికునిలా
ప్రజాక్షేమం కాంక్షించే దేశభక్తునిలా
నిటారుగా... నిబ్బరంగా...
అలా నిలబడే ఉంది !
ఈమధ్యనే...
ఆ స్తంభం శరీరం మీంచి
పెచ్చులూడుతున్నాయి
అప్పుడప్పుడు చెదపురుగులు చేరి
తమ ఆకల్ని తీర్చుకుంటున్నాయి
అయినా...
ఒంటికాలిపై నిలబడి
తపస్సమాధిలో మునిగిన
బక్కచిక్కన మునిలా
అలా నిలబడే ఉంది !
తన యజమానుల ప్రాణాల్ని కాపాడుతూ

ఇప్పుడు నా కాస్తంభంలో
తన జీవితం మట్టిపాలైనా
దేశానికి జీవమిచ్చే రైతు కనిపిస్తున్నాడు
తను కట్టబట్టలేకున్నా
దేశానికి వస్త్రాన్నిచ్చే నేతగాడు కనిపిస్తున్నాడు
తన బ్రతుకు భారమైనా
దేశానికి చెమటను ధారపోసే కార్మికుడు
కనిపిస్తున్నాడు
అందుకే... నా ఇంటిస్తంభం ...
నా కాదర్శం...

[1985]

## దోషం

ఈ పాఠశాల
ఓ చిన్న సమాజం
దొరగారి సుపుత్రుడు
పేదవాడి కొడుకుని
కొడుతూ ఉంటే
చూస్తూ
మౌనంగా ఉన్నారు
మాష్టర్లు —
మన దేశంలోని చట్టాల్లా ! [1985]

# గుండెల మీద చేతులు

అతడు
ఒక శక్తి
ఒక సమాజం
హాలికుడు నాటే విత్తులోని జీవం
కార్మికుడు కరిగించే కండలమీది మెరుపు
కవి కలంలోంచి ఉరికే నవ ఉషస్సు
అతని చూపూ అడుగూ ఆలోచనా
అన్నీ దేశం కోసం...
అతడు నడిచే బాటా పలికే మాటా
అన్నీ మన కోసం...
అడవులే గృహాలుగా బండలే శయ్యలుగా
ఎండా చలీ వానా ఇవే స్నేహితులుగా
తుపాకీ కౌగిలింతలే అర్థాంగి ఆలింగనాలుగా
బాంబుల చప్పుళ్ళే బిడ్డల అల్లరి అరుపులుగా
అక్కడ అతని త్యాగం
ఇక్కడ మనకు భోగం
ముసిరిన చలిలో కూడ
విసిరిన పులిపంజా అతని అడుగు
చిక్కని చీకటిని కూడ
చీల్చే చురకత్తి అతని చూపు
అతని నాడులు తంత్రులై జాతీయ గీతాల్ని
ఆలపిస్తాయి
అతని కన్నులు కుంచెలై
దేశమాత నిత్యకళ్యాణ రూపాన్ని చిత్రిస్తాయి
శత్రువు గుండెల్లో గుబులయ్యేలా
శత్రువు అరికాలి కింద భయమయ్యేలా

శత్రువు యూనిఫామ్ అడుగున సముద్రమయ్యేలా
ఫిరంగుల గానం చేస్తాడు
నిత్యజాగృద్దీప కళికల్లాంటి కళ్లు వళ్ళంతా చేసుకుంటాడు
తన ఊపిర్ని మన చుట్టూ విద్యుత్ కంచెలా నిలబెట్టి
నిద్రలో మన గుండెలమీద చేతులవుతాడు
యుద్ధరంగంలో గాయాలతో
తల్లి సిగలో వికసించిన మందారమవుతాడు
రక్తంతో తడిసి పచ్చిపుండైన శరీరంతో
రెపరెపమంటూ ఎగిరే స్వతంత్రదేశపు జెండా అవుతాడు
అతడిదొకటే ధ్యేయం
అది విజయం
అతడు నేర్చిందొకటే మంత్రం
అది వందే మాతరం [5-1-90]

## బందీ

నా కన్నుల్లో కల
నా హృదయంలో శిల
అది తీరనిది
ఇది పగలనిది
అయినా అందుకే —
నేను మనగలుగుతున్నాను
ఈ కుళ్ళిన వ్యవస్థలో [1981]

# దుఃఖం తర్వాత

అప్సరాంగనల పరిష్వంగం కోసమో
తుమ్మెద రెక్కల ధ్వనుల భావాల కోసమో
దుఃఖిస్తే అది దుఃఖం కాదు —
టొయోటా కార్లపై తిరగాలనో
ఫోమ్ బెడ్‌లపై పొర్లాలనో
దుఃఖిస్తే అది దుఃఖం కాదు —
దుఃఖం - హృదయంలో రేగిన గాయం
దుఃఖం - నాభినుండి సాగిన గేయం

మనిషనే వాడెప్పుడూ దుఃఖించాలి
తనకోసమో తనవాళ్ళకోసమో
గుండె చెరువయ్యేలా
గొంతు బరువయ్యేలా
తన చుట్టూ ఉండేవాళ్ళకోసమో దుఃఖించాలి
కుమిలి కుమిలి
పొగిలి పొగిలి
మనిషి దుఃఖించాల్సిందే —

దుఃఖం మానవ హారాల్ని కడుతుంది
మనసు అద్దంపై రేపటి బతుకు ప్రతిబింబాల్ని నిలబెట్టి
జీవితానికో ఆకృతిని దిద్దుతుంది
దుఃఖం దుశ్శాసనాల నిలినీడల్ని నిలువునా దహిస్తుంది
గుండె కల్లోలంలోంచి లోలోపలి కోరికల్ని బయటకు లాగి
గమ్యంకోసం ఉద్యమాల దారులలో ఊరేగిస్తుంది

దుఃఖించే మనిషి భుజాన్ని తట్టొద్దు
దుఃఖించే మనిషి వెన్నెముకని జాలితో నిమరొద్దు

దుఃఖించే మనిషిని అక్కున చేర్చుకుని ఓదార్చొద్దు
దుఃఖంలోనే మనిషి కళ్ళు తెరవాలి
దుఃఖంలోనే మనిషి వళ్ళు విరవాలి

దుఃఖంలో మనిషి
అలసి
సొమ్మసిల్లి
నిబ్బరంగా లేస్తాడు
గుండెలనిండా ఆశను పీల్చుకుని
నూతనోత్సాహం రెక్కలు కట్టుకుని
కళ్ళల్లో భూగోళం నింపుకుని
సరికొత్త అక్సిజన్ని అవుపోసనపట్టి
నిటారుగా లేస్తాడు
దుఃఖం - ఓ సెర్చిలైట్
దుఃఖం - ఓ డైనమైట్

దుఃఖం తర్వాత మనిషి
చీకటి కోణాల్లో తూర్పు బాణం —
దుఃఖం తర్వాత మనిషి
వంచితుల పిడికిళ్ళలో నినాద కృపాణం —
దుఃఖం తర్వాత మనిషి
బాధితుల కళ్ళల్లో ఆశాతోరణం — [8-5-91]

## సాహసి

అదేమీ ట్రిక్ ఫొటోగ్రఫీ కాదు
ఆ రెండు గెడల శీర్షాలనూ కలుపుతూన్న సన్నని వంతెనపై
దివినుంచి భువికి గాలిలో తేలివస్తూన్న దేవకన్యలా ఆమె
మన కళ్ళముందు ఒక అద్భుత ప్రపంచాన్ని పరుస్తుంది
ముందుకు వేసే ప్రయత్నంలో పాదంతోపాటు
మన గుండెలకు ఒక గొప్ప జర్క్‌నిచ్చి
బిగుసుకుపోయిన పళ్ళమధ్య టెన్షన్ అవుతుంది
ఎవరెస్ట్ శిఖరారోహణం చేసేవాడి చేతిలోని స్వాతంత్ర్యదేశపు జెండాలా
మహాసముద్రంలో బోటుప్రయాణం చేసేవాడి చేతిలోని తెడ్డులా
ఆమె చేతులలో అటూ ఇటూ ఊగుతూ ఆ గెడ —
ఆ గెడతోపాటే మన హృదయాలూ ఊగుతాయి
ఒక లక్ష్యం ఛేదించడానికి తుపాకీ గురిచూసే సైనికునిలా
ఒక గమ్యం సాధించడానికి ప్రయోగం చేసే సైంటిస్ట్‌లా
ఆవలి తీరానికి బిగపట్టిన మన ఊపిరి మీదుగా సాగిపోతుంది
చెట్టుమీద పిట్టతప్ప మరేమీ కనిపించని అర్జునుడిలా
కేంద్రీకరించిన దృష్టితో
మన నోళ్ళు చుట్టిన దీర్ఘవృత్తాల్లోంచి నడచిపోతుంది
డప్పుల మ్రోతల మధ్య ఏకాగ్రత అవుతూ
శరీరాలపై నీటిబిందువులవుతూ
మనలను కొన్ని నిమిషాలపాటు శిల్పాలనుచేసి పారేస్తుంది
ఆమెతో కలసి కదులుతున్న
మన కనుగ్రుడ్లకు రెప్పలు లేకుండా చేస్తుంది
ఈలలు తప్పట్ల నడుమ ఆమొక హీరోయిన్
ఇక్కడెవరూ ఆమెకు డూప్ లేరు

అందరికీ ఆమె తీగమీద నడిచే సాహసైనా
నాకు మాత్రం పేగులమీద కాలుతున్న ఆకలివాసన అవుతుంది
పసిబిడ్డ పాలకోసమూ కట్టుకున్నవాడి సారాయి కోసమూ
కన్నకడుపు కొకచుట్టముక్క కోసమూ
తనకు గుప్పెడు మెతుకుల కోసమూ
చిల్లరకోసం చిక్కులదారి నెంచుకున్న వైనం
నా గుండెల్ని పిండేస్తుంది
ప్రదర్శన తిలకించి నాణెం విసిరే ప్రాణాలకన్నా
వ్యభిచరించిపోయే కళ్ళే ఎక్కువ
అయినా ముఖం మీద చెరగని చిరునవ్వు ముద్రతో
లోకం పోకడ అవుపోసన పట్టిన మహాఋషిలా మౌనంగా
ముఖాల ముందుకు చాచిన చేతులతో
చూపులు పక్కకు తిప్పుకోవడాలను పోగుచేసుకుని
మరో సెంటర్‌ను ఎన్నుకుంటుంది
జీవితమంత విశాలమైన దరిద్రాన్ని మోస్తూ... [11-1-90]

# రెప్పలమీద రేపును మోస్తూ

చూపులతోనో కబుర్లతోనో జాబులతోనో
స్పృశించుకునే రోజులా ఇవి ?
జ్ఞాపకాల్లో జాజిపువ్వుల పరిమళాలెక్కడ ?
నవ్వుల్లో మువ్వలమ్రోత లేవి ?
ఇక్కడ పలకరింపుల్లో పాయసం దొరకదు ఇప్పుడు
ఇక్కడ స్పర్శల ముసుగులో సర్పాల బుసల చప్పుడు
మాటల వీణల మమతానురాగాల
తంత్రులు తెగిపోతున్నాయి
కందిరీగలు తేనెటీగలమీద దాడిచేస్తున్నాయి
నీళ్ళను ముక్కులతో పొడుస్తూ కొంగలు
చెరువు శిలంపై కాపేస్తున్నాయి
చిటికెన వేళ్ళను పెనవేసుకున్న
చిటికెన వేళ్ళే కిరసనాయిల్ని పోస్తున్నాయి
గుండె పత్రాలకు గొంగళీలు పడుతున్నాయి
బతుకు వెన్నెముకలకు భయాలు అతుక్కుంటున్నాయి
రెక్కలు తెగిన పక్షి ఎక్కడికని ఎగురుతుంది ?
కొమ్మలపై పిట్టలు తలక్రిందులుగా ఛస్తున్నాయి
అడ్రసు వ్రాయని జాబు ఎక్కడికని చేరుతుంది ?
పోస్టుబాక్సులో ఉత్తరాలు తలలు నరుక్కుంటున్నాయి
దేశం మనుషులనూ, మనుషులు స్వార్థాన్నీ,
స్వార్థం వాగ్దానాల్నీ కంటున్నట్లు
ఏళ్ళతరబడి రోడ్లు గుంటల్ని కంటూనే ఉన్నాయి
అయినా ప్రయాణం ఆగదు...
రెప్పలమీద రేపును నిలబెట్టుకుని ఊపిరిలో
ఆశల జెండా పట్టుకుని
నువ్వు పిడికిలి విదిలిస్తే భూగోళం బద్దకం తెగుతుంది
తుమ్మెద నమ్మకంగా మోసంచేసి పోయినా
శిరసెత్తుకుని నిలబడే పువ్వు ఆదర్శమవుతుంది.



[9-12-91]

# వృద్ధాప్యం

కోడళ్ళ నిండుసభలో
కొడుకుల నోళ్ళకు తాళాలు పడతాయి
అప్పుడు అతడైనా ఆమైనా
ద్రౌపదిలా సిగ్గుతో కుచించుకుపోతారు
ఆమె పట్టమహిషిలా వెలిగినచోటే పనిమనిషవుతుంది
అతడు ఒక నిషిద్ధ సామ్రాజ్యంలో
ద్విపాత్రాభినయం చేస్తాడు

కాలు విరిగీ అద్దం పగిలీ కళ్ళజోడూ
గూడ తెగీ బాగా అరిగీ కాళ్ళజోడూ
తమలాగే వృద్ధాప్యం పాలవుతాయి
కంటికి శూన్యమూ మాటకు దైన్యమూ తోడవుతాయి
గుండె నెగడైనప్పుడు
ముఖంమీద పలికించే చిరునవ్వు వెలవెలబోతుంది
నిద్రపట్టని రాత్రిళ్ళు పక్కే పాపై కరుస్తుంది
దిండుమీద దిగుళ్ళ ఆనవాళ్ళు ఏర్పడుతాయి
జీవితం నలిపిపారేసిన చిత్తుకాగితపు ఉండవుతుంది
చూపుపై నడకపై దగ్గుపై పడకపై
నియమ నిబంధనల రూల్సు జారీ అవుతాయి
చుట్టూరా బ్యారికేడ్లు కడుతూ మాటలు
కప్పుకున్న కంతల దుప్పటీ సాక్ష్యంగా
గుండెను డ్రిల్లింగ్ చేస్తాయి

వృద్ధాప్యానికి నిర్వచనం వెలిగే కొవ్వొత్తి యవ్వనం
మనసుని గతానికీ వర్తమానాన్ని
వంటికీ ఇవ్వడమే వృద్ధాప్యం
మానవ సంబంధాలకు మసిపూసేస్తూ
మమతానుబంధాలను నుసిచేసేస్తూ

ఏర్పడిన కొత్తతరహా ప్రపంచంలో
విసుగుల ఈసడింపుల గేలాలకు
వ్రేలాడ్డమే వృద్ధాప్యం

పెద్దరికమూ పెత్తనమూ ముప్ఫైఏళ్ళ
ఒక సుదీర్ఘ పరిపాలనా
చెప్పకుండానే చేతులు మారడం వృద్ధాప్యం
గాయాలకు చిక్కిన హృదయాన్నీ
రోగాలకు దక్కిన శరీరాన్నీ
జోలెగా చేసుకుని
మృత్యుదేవతను భిక్ష అడగడమే వృద్ధాప్యం

ఇల్లే జైలైన వయస్సది
ఎక్కడికీ పోనీపోలేనీ మనస్సుని పొదుగుకున్న తనువది
మాటల వైతరణి మీదుగా నరకాన్ని చేరేది
రోజు కెన్నిసార్లో లెక్కించలేని హృదయమది
పరాధీనతా బ్రతుకు బాధలన్నీ
నరాల నదులగుండా ప్రవహిస్తున్న కాలమది
బలికి సిద్ధంచేసిన మేకపిల్లలా మూగవేదన
అనుభవించే ప్రాణమది

అమ్మచేతి అన్నం ముద్దలూ
నాన్న ఇచ్చిన తీపి ముద్దులూ
కొడుకుల గుండెల్లో దీపాలయితే
ముసలితనం బరువూ కాదు, నిద్ర కరువూ రాదు.

1-12-91]

# చీకటి పువ్వు

అసహ్యాలను ఆలింగనాలతో
ఆహ్వానించే పువ్వు !
పశుత్వాలను చుంబనాలతో
పలుకరించే పువ్వు !
ఉంగరాల వేళ్ళముందు
వెకిలి నవ్వుల ముందు
స్కాచ్ విస్కీ వాసనలముందు
సిగ్గువిడిచి రేకులు ఒలిచిన పువ్వు !
మనసు ఉన్నా
'మనసు' లేని పువ్వు !
స్పందన ఉన్నా
'స్పందించ' లేని పువ్వు !
రెప్పలచాటున జలపాతాలను
దాచేపువ్వు !
గుండెల మాటున ఆవేదనాఘాతాలను
భరించే పువ్వు !
మసక దీపాల కాంతుల్లో 'వెలిగే' పువ్వు !
మృగాల కర్కశ కరముల్లో 'నలిగే' పువ్వు !
వేదనా వేదనలు ఎదలో గూళ్ళుకట్టుకున్నా
రంగురంగుల సీతాకోకచిలుకల రెక్కల్ని
కంట మెరిపించే పువ్వు !
నిస్సత్తువ నీరసాలు మేనిని నరుకుతున్నా
అరవిరిసిన కుసుమపరాగ మాధుర్యాలను
నోట పలికించే పువ్వు !

ఆవేశపూరిత దృక్కుల తూట్లను
ఆత్రంగా తడిమే మోటువేళ్ళ పోట్లను
నిస్సహాయంగా ఆదరించే పువ్వు !
సిల్కు లాల్చీ ముందు
ఖద్దరు పంచె ముందు
నల్లకళ్ళద్దాల ముందు
చిరునవ్వులతో నటించే పువ్వు !
పాపాయి పాలకోసం
'పాపాలు' చేసే పువ్వు !
ఆకలి తీర్చుకోవడం కోసం
'ఆకలి' తీర్చే పువ్వు!
గుప్పెడు కాసులకోసం
గుండెడు 'ఊసుల్ని' చంపుకున్న పువ్వు !
ఆమె...
ప్రాణం ఉన్న ప్లాస్టిక్ పువ్వు ! [15-11-89]

# గమ్యం

ఆకాశం లోంచి
జారిన కణాలు
రెటీనాని వెలిగిస్తూ ఉంటాయి —

కాగితం మించి
రేగిన అక్షరాలు
గుండెను మరిగిస్తూ వుంటాయి —

అనుభవం నుంచి
ఉరికిన క్షణాలు
మెదడును మధిస్తూ వుంటాయి —

♦ ♦ ♦ ♦ ♦

స్వేదంతో కట్టిన
మేడ
కాలచక్రం క్రిందపడి
కూలిపోతుంది —
ద్రోహచింతన పేరుకున్న
మనస్సు
కన్నీటి బొట్లు తగిలి
కాలిపోతుంది —
స్వార్థం నిండిన
నయనం
చైతన్యకాంతి సోకి
పేలిపోతుంది

♦ ♦ ♦ ♦ ♦

అప్పుడు
నువ్వెకడున్నావని వెదికితే
నీ చిరునామా
సింహాసనంపై దొరికింది ! [12-12.89]

# ఒకటో తారీఖు

నెలసరి జీవితాల కళ్ళల్లో కాయల్ని కాస్తుంది
నట్టింటికి నడిచొచ్చే మహాలక్ష్మిలా అభయమిస్తుంది
చుక్కల తేదీల ఆకాశ మాసంలో
ధృవపు చుక్కలా మెరుస్తుంది
నెల రోజుల విధి నిర్వహణా పూజానంతరం
ప్రసాదాన్నిచ్చే పూజారిలా దర్శనమిస్తుంది
నెలవారీ బ్రతుకు గృహాల పునాదిలా నిలుస్తుంది
దులిపేసుకున్న చేతులవుతుంది పదోనాటికే
లాగుతున్న కాళ్ళవుతుంది పదిహేనో రోజునుంచీ
సముద్రంలోకి వేటకెళ్ళిన కొడుకోసం ముసలి జాలరీ
కాలేజీ కెళ్ళిన కూతురు రాకోసం తల్లిమనసూ
తొలకరి చినుకుల ఆప్యాయతా
స్పర్శకోసం పగుళ్ళభూమీ
కళ్ళవత్తులతో పరీక్షాఫలితం కోసం విద్యార్థీ
చూసే ఎదురు చూపుల్లాంటి
ఎదురు చూపవుతుంది నెలమధ్యనుంచీ
వాళ్ళవద్దా వీళ్ళవద్దా తడుముకుంటూ
కుంటినడకతో గడుపుకుంటూ
ఆందోళనా పర్వమవుతుంది చివరి రోజుల్లో
నెలాఖరు తెల్లారగానే పెద్దపండగొస్తుంది
నిండుముత్తయిదువులా ఇంటికొచ్చిన ఒకటో తారీఖు
నాల్గురోజులు గడిచీ గడవగానే
నిలువుదోపిడీ ఇచ్చి నిరుపేదవుతుంది
వసంతంలా తోటకొచ్చిన ఒకటో తారీఖు
నాల్గురోజులు గడిచీ గడవగానే
శిశిరంలా చిక్కిపోయి వెలవెలపోతుంది.

పాలవాడూ షాపువాడూ
పనిపిల్లా ట్యూషను మేడమూ
అద్దెఇంటి యజమానీ
నవ్వుల ఓవర్‌కోటింగుల ముఖాలతో
నమస్తేలవుతారీ ఒకటో తారీఖునే ...
అప్పులిచ్చినవాడు
ఆఫీసు గేట్‌మేనవుతాడీ ఒకటో తారీఖునే ...
చీకటి సెంటర్లో ఎలక్ట్రిక్ పోల్లాంటిది
ఈతగాని కగుపించే ఆవలిగట్టులాంటిది
శిఖరారోహణంలో ఆక్సిజన్ సిలిండర్లాంటిది
నెల జీతగాళ్ళకీ ఒకటో తారీఖు. [19-6-91]

## పరిణాదరణ

నేను నాయకుణ్ని కాదు
కవిని
అందుకే—
నాకు సన్మానం జరిగేది
దండలతోకాదు
గుండెలతో. [1982]

# దేశమును ప్రేమించుమన్నా

ఆచేతులు

ఘనంగా, విజ్ఞానాన్ని బోధిస్తున్నాయి
అయినా నాలో ఏదో అసంతృప్తి !

ఆచేతులు

చక్కగా, ప్రాణరసాన్ని పండిస్తున్నాయి
అయినా నా ఎదలో ఏదో వెలితి !

ఆచేతులు

కార్ఖానాలో చెమటను చిందిస్తున్నాయి
అయినా నా మదిలో ఏదో ఆరాటం !

ఆచేతులు

గొప్పగా, కుండల్ని మలుస్తున్నాయి
అయినా నా మనసులో ఏదో ఆదుర్దా !

ఆచేతులు

పదునుగా, రచనలు చేస్తున్నాయి
అయినా నా హృదయంలో ఆరని జ్వాల !

ఆచేతులు

చురుకుగా, అక్షరాలు దిద్దుతున్నాయి
అయినా నా మెదడులో ఏదో కోరిక '

ఆచేతులు

ఎత్తుగా, మొక్కల్ని పెంచుతున్నాయి
అయినా నాలో ఏదో తీరని తృష్ణ

ఆచేతులు

నిత్యం, వాగ్దానాల్ని చేస్తున్నాయి
అయినా నా ఎదలో ఏదో నిరాశ !

ఆచేతులు
రేయింబవళ్ళు, కొత్త దారుల్ని వెతుకుతున్నాయి
అయినా నాలో ఏదో నిస్పృహ !
ఆచేతులు
అందంగా పువ్వుల మాలలల్లుతున్నాయి
అయినా నాలో ఏదో అశాంతి !
ఆ కోట్లాది చేతులు
ఒక్కసారిగా, ఒక్కుమ్మడిగా లేచి
ముచ్చటగా ఎగురుతూన్న
మువ్వన్నెల జెండాకు శాల్యూట్ చేసాయి
ఇప్పుడు
నా హృదయంలో ఆనందం
నా కన్నుల్లో వెలుగు
నా ఆలోచనల్లో సంతృప్తి. [1985]

## అహం

వాడు గొడ్డలితో చెట్టును నరుకుతూనే ఉన్నాడు
చెట్టు భరిస్తూనే తిరిగి చిగురేస్తోంది
వాడుభర్త ! చెట్టు భార్య !
గొడ్డలి పురుషాహంకారం ! [1984]

# మధ్యాహ్నం మండుటెండ

తప్పుచేసి దొరికిన భర్తపై
చిర్రుబుర్రులాడే భార్యలా ఉంటుంది
ఎదిరించిన విద్యార్థి చెంపపై
తేలిన మాష్టారి చేతివేళ్ళ తట్టులా ఉంటుంది
కొరకరాని కొయ్యలా కొలిమిలో కాలే గూటంలా ఉంటుంది
ఆడపిల్లల తండ్రి హృదయంలా ఉంటుంది
నక్సలైటు భుజంమీది రైఫిల్లా ఉంటుంది
నింగికీ నేలకూ వేసిన నిప్పుల వంతెనలా ఉంటుంది
పాలకోసం పిల్లాడు పట్టే గుక్కలా ఉంటుంది
నిరుద్యోగి నిట్టూర్పులా ఉంటుంది
ఆకాశం నుంచి కురిసే సూదుల వర్షంలా ఉంటుంది
కర్ఫ్యూ పెట్టిన నగరంలో
కనిపిస్తే కాల్చడానికి సిద్ధంగా ఉన్న సైనికుడిలా ఉంటుంది
రెప్పవాల్లేని రాత్రిలా విసుగ్గా ఉంటుంది
లాకప్పులో చెలరేగే లాఠీ దెబ్బల్లా ఉంటుంది
మేని బావిలోంచి స్వేదజలాన్ని తోడే ఏతాములా ఉంటుంది
అవమానంలా అనుమానంలా ఉంటుంది
తప్పతాగి ఇల్లాల్ని హింసించే డ్రింకర్లా ఉంటుంది
మూసి ఉన్న కిటికీలోంచో బిగించిన తలుపు సందుల్లోంచో
గాడ్పై దాడి చేస్తుంటుంది
శరీరం మీద చిటపటల తాండవ మాడుతూ ఉంటుంది
చింతామణి చేతిలో తిరుక్షవరమైన భవానీశంకరుడి
మనసులా ఉంటుంది
బాబోయ్ మధ్యాహ్నం మండుటెండ
ఇప్పటికీ నన్ను భయపెడుతూ ఉంటుంది
తాతయ్య చెప్పిన ఆఫీసు కథలోని లంచగొండి రాక్షసుడిలా

[17-11-89]

# ఫొటో ఆల్బమ్

అదో జ్ఞాపకాల పెట్టె
మూత తెరిచానా
హృదయ వీణా సిరల తంత్రులపై
మమతారాగం పలుకుతుంది
పారిజాత వృక్షచ్ఛాయన విశ్రమించినట్టూ
దేవాలయ ప్రాంగణంలో పావురమై వాలినట్టూ
పైరు మధ్యన పచ్చతో కరచాలనం చేసినట్టూ
ఎదురైన ప్రతిచిత్ర దృశ్యం కళ్ళను వెలిగిస్తుంది

అదో అనుభూతుల సరస్సు
అందు పాల్గొన్నానా
బాల్యం నాటి అమాయకత్వం
తనువంతా తడుముతుంది
అమ్మచేతి గోరుముద్ద తిన్నట్టూ
నాన్న వీపుమీద ఏనుగు అంబారీ ఎక్కినట్టూ
తాత మీసంతో ఉయ్యాలూగినట్టూ
సీతమ్మ చిలకలా
ఆనందం గుండె అంచులమీద వాలుతుంది

అదో మధుర స్మృతుల సరస్సు
అందు దుమికానా
స్నేహ పరిమళం గుప్పున
తలారా తడుపుతుంది
ఏకాంతంలో సరసన మనుషుల్ని నిలబెడుతూ
మౌనంలో ఒడినిండా మాటల్ని వర్షిస్తూ
నిర్లిప్తతలో మనసుగుండా ఉత్తేజపవనాల్ని వీస్తూ
మునివేళ్ళ స్పర్శల నడుమ
ఇంద్రధనుసై విరుస్తుంది

ప్లాస్టిక్ కాగితాల గదుల్లో ఖైదీలయిన అవి
నిశ్చల చిత్రాలుకావు
గతకాలపు సుద్దులను స్ఫురణకు తెస్తూ
భవిష్యత్తుకు ప్రేరణలవుతాయి
మది మడిలో పచ్చని
ఆలోచనల నారును నాటుతూ
కలల పంటలకు ఎరువులవుతాయి

కెమేరా కంటిలోంచి ఊడిపడిన
ప్రతిబింబాలు కావవి
జీవన సాగరంలోంచి ఉద్భవించిన
ఆణిముత్యాలు
బ్రతుకు వృక్షాన్ని పెనవేసుకున్న
అనుబంధపు తీవెలు
మెదడు గుడిలో వెలిగే అఖండ జ్యోతులు
అభిమానం నిండిన చూపులతో వెన్నంటి ఉంటూ
గుండెలో తియ్యటి హింసపెడతాయి
అనురాగం పంచే చేతులతో ఆలింగనాలిస్తూ
గుండెకు గులాబీ పూలు తొడుగుతాయి

ఆ ఫొటో ఆల్బమ్
నా స్వంత ప్రపంచపు చరిత్ర పుస్తకం.

[24-6-91]

# సుదీర్ఘ స్వప్నం

ఏడుపుతో మొదలై
ఏడుపుతో ముగిసే జీవితంలో
ఏడుపేనా ఎప్పుడూ?...

కనుసైగలకు జీవితాలు బలయ్యేచోట
ఏదో ఒక రోజు
ఊహ ఊపిరిలో ఎర్రగా చిక్కబడుతుంది
ఘనీభవించిన కళ్ళు ఎప్పుడో ఒకప్పుడు
స్వప్నాల్ని వెలిగించుకుంటూ కదంతొక్కుతాయి
జడంగా ఎడంగా పడిఉన్న దేహాలు
ఏనాడో ఒకనాడు
కంటి ఎరుపుల్తో ఏకమవుతాయి
వేల చేతులతో విస్తరించిన ఒకకేక
శిరసెత్తిన ధిక్కారమవుతుంది
జీవితాలన్నీ వసంతాలయితే
ఈ వేదనలెందుకు ? ఈ రోదనలెందుకు ?
బతుకులన్నీ పూలతోటల పరిమళాలయితే
ఈ నాదాలెందుకు? ఈ నినాదాలెందుకు?

ప్రవహించినప్పుడే నది జీవిస్తుంది
ప్రసరించినప్పుడే వాయువు ప్రాణమవుతుంది
కదలినప్పుడే కొమ్మ వింజామరవుతుంది
సమస్తాంగాలనూ కూడదీసుకుని
మనిషి ఉవ్వెత్తుగా నిలబడినప్పుడే
ఒక సుదీర్ఘస్వప్నం నిజమవుతుంది.

[7-5-90]

# స్వరగంగ

బడినుండి వచ్చీరాగానే పుస్తకాల సంచీ మూలకు గిరాటు వేసి
పక్కింటి పిన్నిగారి గొంతుకలో నిన్ను వెతుక్కున్న సాయంత్రాలు
ఇంకా నా హృదయ మైదానంలో ఊపిర్లను మొలిపిస్తున్నాయి.
రెటీనా వెనుకే నిద్రను అలలు అలలుగా తొక్కిపట్టి
నాటకం రిహర్సల్స్‌లో నిన్ను గుండెకు అదుముకుంటూ గడిపిన రాత్రిళ్ళు
ఇప్పటికీ నా మార్గంలో స్వప్నాల్ని ప్రసవిస్తున్నాయి
పసివయసు ప్రాంతంలోనే నీమెట్లమీద స్వరాలు దిద్దుకున్నవాణ్ని
నా వేళ్ళ కొసలకుంచెలతో నీపై రాగచిత్రాలు రచిస్తూ
పులకాంకితమవ్వకుండా ఉండలేను
నీ పలకరింపుల దారాలతో పేనిన తాళ్ళపై
నా గుండెను ఊయలగా చేయకుండా నిలువలేను.
నువ్వు నన్నానుకుని నిలబడినప్పుడు
నీ భుజంమీద మిత్రవాత్సల్యపు పావురాన్నై వాలకుండా నడవలేను
నీ మెట్లమీద వేళ్ళు ప్రాణాల్ని పోసుకుంటాయి
అప్పుడు నువ్వు ఏడక్షరాలు కలబోసుకుని రాగరంజితమవుతావు
అప్పుడు నేను దేవాలయ ప్రాంగణంలో వాలిన నిర్మలత్వాన్నై పోతాను
అప్పుడు నువ్వు బిరాన స్వరాల వరాల కీరాల నెగరేస్తావు
అప్పుడు నేను అమ్మ ఒడిలో పడుకున్న పాపాయిలో పరకాయ ప్రవేశంచేస్తాను
నువ్వు రాగాలు సంధించినప్పుడల్లా
నన్ను వేధించే ప్రశ్నలు రెక్కలు తొడుక్కుని ఎటో ఎగిరిపోతాయి
నా మానసిక అంగవైకల్యాల ప్రదర్శనలు అర్ధాంతరంగా ఆగిపోతాయి
కవికి కలమెంత ప్రాణమో నీతో నాకంత స్నేహం
గాయకుడికి గళమెంత ప్రధానమో నీపై నాకంత మోహం
తెలిసో తెలియకో ఆనందమో ఆవేశమో
నీతో కలసి ఏడుస్వరాలు నడిచినవాణ్ని

నన్ను నీవో నిన్ను నేనో స్పృశించని రోజు లేదురైనప్పుడు
నా మునివేళ్ళు ఆత్మహత్య చేసుకుంటాయి
నీ నాదరథంపై రాగాల దారులలో ఊరేగుతున్నంతసేపూ
అన్నీ మంచమే అయిన అమ్మజ్ఞాపకాలు ఇబ్బంది పెట్టవు
నీతో కరచాలనం చేస్తున్నంతసేపూ
ఇల్లాలి కన్నీళ్ళూ వెక్కిళ్ళూ వేటాడవు
నీతో మెట్టు దాటి మెట్టు ఆరోహిస్తూ అవరోహిస్తూ ఉన్నంతసేపూ
అవసరాల ఉరుల ముడులు భయపెట్టవు
జీవిత వైఫల్యాల నుంచీ మరుగుజ్జు మనస్తత్వాల నుంచీ
మొహమాటపు చూపులనుంచీ రకరకాల ఉగ్మతలనుంచీ
నువ్వు మరపించే ఆ కాస్త సమయం చాలు
మృత్యువు నెదిరించేంత ధైర్యం పుట్టుకొస్తుంది
భ్రమల ధూళి తుడుచుకుపోయి గుండె అద్దంలా మెరుస్తుంది
హార్మోనియం ! హార్మోనియం !
నిత్యం బలహీనతల గంగలో మునకలువేసే నా హృదయంపై
నువ్వు రసరమ్యరాగాల సురభిళాన్ని చల్లుతున్నప్పుడల్లా
స్వరగంగలోనే కాదు సురగంగలో స్నానిస్తున్నంత అనుభూతి.

[20-12-91]

# ఆకాశం వెలుగు అందరిదీ

కన్నీరు, పిరికితనంలా ఇన్నాళ్ళూ భయపెట్టేది
ఇకముందు, గుండె పంజరాన్ని చీల్చుకుని
బిగిసిన పిడికిళ్ళై ప్రవహిస్తుంది
పట్టకాన్ని తాకి సప్తవర్ణాలైన శ్వేతకిరణంలా
నినాదాలై ప్రతిధ్వనిస్తుంది హృదయంపై
వాలిన దుఃఖం —
చెత్తకుండీలయిన జీవితాల్లోంచి మెలకువ
కాగితాలు ఎగురుతాయి
గాడిపొయ్యిలైన కలతనిద్దుర కనులు
వేకువ తుఫానులను వీస్తాయి
గాయాలు జనించిన మనసు ఎర్రమందారాల
తోటవుతుంది
బతుకులో ప్రశ్న జవాబుకోసం వేటాడుతుంది
నాలుగు రోడ్లకూడలిలో తెగిపడి ఉన్న చెప్పులు
రాత్రులను ఎర్రెర్రగా విశ్లేషిస్తాయి
ఆస్పత్రి గోడపక్కన సీసాపెంకుల కుప్పలు
రహస్య జననాలను సమీక్షిస్తాయి
రైలు పట్టాల నడుమ పడిఉన్న శవం పిడికిళ్లు
బతికుండగా మరణించిన క్షణాల్ని
వాంగ్మూలమిస్తాయి
రేడియో గొంతుకలో సుప్రభాతం
మరునిమిషంలోనే
వెన్నువిరిగిన వ్యక్తిత్వమవుతూ
మన గొంతుకడ్డంపడిన పచ్చివెలక్కాయవుతుంది
చిరునవ్వులుకూడా చిచ్చుపెడతాయి
నీడలుకూడా దగాచేస్తాయి
కబళించే ప్రకటనల ప్రయాణాల్ని ఆపాల్సిందే
ఇంటి దొంగ ఈశ్వరుడైనా శిక్ష వేయాల్సిందే
ఆకాశం వెలుగు అందరిదీ కదా !

[30-4-90]

## దొడ్డ మనుషులు

చిలక గోరింక
ఒక జాతివి కాకపోయినా
వాటికి జంట కట్టి
ఆనందిస్తారు ఈ మనుషులు —
రావిచెట్టు వేపచెట్టు
ఒక జాతికి చెందకపోయినా
వాటికి పెళ్ళిచేసి
సంతోషిస్తారు ఈ మనుషులు —
ఒక కులం కాదని
ఒక జాతి కాదని
ప్రేమికుల్ని క్రూరంగా విడదీసి
దూరం చేస్తారు ఈ మనుషులే — [1984]

## నిద్ర - కల

నిద్రలో
ప్రతీ కదలికా ఓ కల అవుతుంది
నిజానికి ...
ప్రతీ కలా బండరాయిని తాకిన
అల అవుతుంది
బతుకు రహదార్లో
కల కుందేలై తాబేలు గెలుస్తుంది
నిద్ర
మనసులోకి కలల్ని
స్పిన్ బౌలింగ్ చేస్తుంది
వాస్తవం బ్యాట్‌తో ఎదుర్కోక పోతే
జీవితంలో
'డక్కవుట్' అవక తప్పదు ! [15-3-90]

# దృశ్యాలే ఊపిరిగా

దృశ్యంతో కళ్ళు యుద్ధం చేస్తే జరిగేది అంతర్మథనం
దృశ్యమే ఊపిరైనప్పుడు సాగేది గమ్యంవైపు గమనం
దృశ్యం కవిత్వమవుతుంది
తనువునిండా అనుభవమై ఆవరిస్తుంది
తల్లిపేగులా పెనవేసి వెలుతురు సీమలవైపు నడిపిస్తుంది
సూర్యుడిలా పలకరించి చైతన్యాన్ని బిక్షవేస్తుంది

దృశ్యం ఓ పదునైన కత్తిపీట
దృశ్యం పూచిన మోదుగు పూలతోట
మనసుకూ మనసుకూ నడుమ వంతెన అవుతుంది
కన్నీటిపాటై గుండెలమీద ప్రతిధ్వనిస్తుంది
ఆకాశం నీలిమను భూమికి సమంగా పంచుతుంది
గొంతులో శబ్దిస్తుంది దృశ్యం గాలమై
దీపస్తంభం అవుతుంది దృశ్యం గాయమై
బ్రతుకు సంద్రంలో తీరం చేర్చే నావ అవుతుంది
కంటి ఎరుపులో పూచి సాక్ష్యమవుతుంది
కళ్ళకు పట్టిన కలలధూళిని దృశ్యం దులిపేస్తుంది
భూమిలో నాటిన ప్రాణమై
దృశ్యం జీవితాల్ని పచ్చగా మొలకేస్తుంది

దృశ్యాన్ని ఊపిరినిండా
నింపుకున్న పెదాలు ధైర్యాన్ని గానం చేస్తాయి
దృశ్యాన్ని శరీరంపై
పఱచుకున్న కాగితాలు నిస్తేజాన్ని దహించివేస్తాయి
దృశ్యం ఎంత పదునైనదో
కన్నీటి వాసనలతో గడ్డకట్టిన తలగడలకు తెలుసు

దృశ్యం ఎంత కరుకైనదో
వేదనలతో రోదనలతో రగులుతున్న మనుగడలకు తెలుసు

దృశ్యమంటే
పెదవుల చివరల మీంచి కురిసే వాగ్దానధారకాదు
కాగితం మీద మెరిసే మోళీకాదు
దృశ్యమంటే
పుష్పించే కొమ్మ, మొలకెత్తే విత్తు
నిప్పుమగప్పిన నిప్పు, విస్ఫోటనం చెందే అణువు
జీవితాల్లో వినూత్న కాంతులను ఆవిష్కరించేదే దృశ్యం
మరుభూమి నుండి మరో సుందర భూమివైపు
పయనింప చేసేదే దృశ్యం

కాగితాలైనా పెదాలైనా
దృశ్యాన్ని గుండెలనిండా పొదుగుకున్నప్పుడే
బతుకులు తూర్పునుంచి ఎగిరే వెలుతురు రెక్కలవుతాయి

[28-1-90]

# దాన్ని ఆదర్శం చేసుకుని

ఎన్నాళ్ళనుంచో దానికీ నాకూ స్నేహం
ఏ శుభముహూర్తంలో నా చేయినందుకుందో కాని
మాది అయస్సూ అయస్కాంతాల బంధం
నేను సైకిలెక్కితే
తను, హేండిల్‌ని స్థావరం చేసుకుంటుంది
నేను బస్సులో ఇరుక్కుపోతే
తను, నా గుప్పిట్లో గువ్వలా ఒదిగిపోతుంది
అక్కడకేమిటి ? ఇక్కడకేమిటి ?
నేనెక్కడకు వెళ్ళినా
ఆవు వెనక తేగవుతుంది
పువ్వు వెంట పరిమళమవుతుంది
ఆలయానికి వెళ్ళినా, కొబ్బరికాయలు తనే తెస్తుంది
కిరాణాకొట్టుకెడితే, సరుకుల్ని ప్రాణసమంగా చూస్తుంది
నూనెడబ్బా ఇచ్చినా జిడ్డు జిడ్డని విసుక్కోదు
కారం మోసినా వళ్ళుమండుతుందని చికాకుపడదు
ఇప్పుడిప్పుడే కుట్లూడుతున్నా
కుర్రతనం చేష్టలింకా పోలేదు
శరీరంపై చిన్నచిన్న తూట్లేర్పడుతున్నా
హృదయం తెరచి ఆహ్వానిస్తూనే ఉంటుంది
చదివేవేళ, విద్యార్థి చేతిలోని పుస్తకంలా
రాత్రివేళ, బాటసారి చేతిలోని బ్యాటరీ లైటులా
నడిచేవేళ, ముదుసలి చేతిలోని చేతికర్రలా
ఇల్లు వదలినవేళ, నాచేతిలో అది చేదోడు వాదోడులా
ఇంట్లో ఉన్నంతసేపూ
గోడకు వ్రేలాడదీసిన శవమైపోతున్నా

నా స్పర్శ సోకగానే
జీవచ్ఛవంలాంటి చదువులు చేరా చెమటోడ్చడానికి చేరుకుంటారు
మహాత్ముని గుండెలాంటిది
కొండంత అండ లాంటిది
దేవుని గర్భగుడిలా పవిత్రంగా
నిజానికది నాకొక నేత్రంగా
ఇటీజె ఫ్రెండ్ ఇన్ నీడ్
ఇటీజె గైడ్ ఇన్‌డీడ్
దాని సేవ స్వార్థరహితం
దాని ఎడద ప్రేమామృతం
కుతంత్రాలను మోసే
కుళ్ళు రాజకీయాల నాయకుని
'గుండె సంచీ' కన్నా
ఫార్‌బెటర్ కదూ ఈ నా 'చేతి సంచీ'

[11-10-89]

## ఈ భూమిలో....

చిన్నిబాలుడు ధైర్యంగా
రక్కసి మూకల చెండాడిన ఈ భూమిలో
చాల మంది చిన్న అన్యాయాన్ని కూడ
ఎదిరించలేక పోతున్నారెందువల్లనో! ?

ఒక పురుషుని పాదధూళి సోకినంతనే
రాతి నాతిగ మారిన ఈ భూమిలో
ఎన్నో కన్నీటి బిందువులు తాకినాసరే
కరగని హృదయ పాషాణాలున్న వెందుకో! ?

దేవుడిగా కొలువబడిన రాముడే
శబరి ఎంగిలి తిన్న ఈ భూమిలో
అంటరాని వారంటూ కొందరు
దూరంగా నెట్టబడి నారెందుకనో! ?

కొన్ని కోతులు కలసి
సముద్రానికే వారధి కట్టిన ఈ భూమిలో
ఎందరో మానవులు తమ కష్టాల సముద్రానికి
అడ్డుకట్టుకోలేక పోతున్నారెందువల్లనో! ?

ఇక, గుండెల నేలుతున్న
చీకటి రావణ సంహారమే జాతికి భవ్యం !
అందుకు, చైతన్యం వెలుగులతో
ఊర్మిళ నిద్రనుండి మనిషిని లేపడమే భావ్యం!

[1982]

# స్పర్శ

మౌనం మంచులా ముఖాన్ని కప్పినప్పుడు
ఒక్క చేతి స్పర్శ
వేయి సూర్యుళ్ళను ప్రసవిస్తుంది —
జీవితం పచ్చి పుండైనప్పుడు
ఒక్క వాక్కు స్పర్శ
శస్త్రరహిత చికిత్స చేస్తుంది —
కన్నీటి బిందువులను తుడిచే
ఒక్క మునివేలి స్పర్శ
సంకల్ప బలాన్ని ప్రసాదిస్తుంది —
జీవన వాస్తవ చిత్రణ పొదిగిన పేజీ
ఒక్క చూపు స్పర్శతో
ఆరని అగ్నికణమవుతుంది —
శీతగాలి స్పర్శతోనే
మబ్బు జల్లవుతుంది
ఒక్క ఆత్మీయతా స్పర్శతోనే
మనిషి హరివిల్లవుతాడు —
దీపాల స్పర్శతోనే
రహదారి ప్రాణంతో సాగిపోతుంది
ఒక్క చిరునవ్వు స్పర్శతోనే
మనిషి మహోన్నత పథంవైపు గమిస్తాడు —
నాగలి కర్రు స్పర్శతోనే
పొలాలు పంటల జెండాలెగరేస్తాయి
ఒక్క ఆదరణ పూరిత స్పర్శతోనే
మనిషి పునరుజ్జీవనం పొందుతాడు —

పిట్టల రెక్కల చప్పుళ్ళ స్పర్శతోనే
చెట్లు వెలుగుతాయి
పరస్పరం పలకరింపుల స్పర్శతోనే
మనిషి చైతన్య దీపపు శిఖ అవుతాడు —

స్పర్శ - మనిషికి ఒక జీవం
స్పర్శ - జాతికి ఒక నీతి
స్పర్శ - సంఘానికి ఒక సందేశం

మనిషికి మనిషికి మధ్య స్పర్శలు కరువైతే
మనుషులు ముందు చూపు కోల్పోయినట్టే —
స్పర్శలు బరువైన సమాజం
స్పర్ధలతో మృతప్రాయమైనట్టే —

స్పర్శలను ఆవాహన చేసే సంఘం
సమానత్వాన్ని చాటుకుంటూ పురోగమిస్తుంది—
స్పర్శలను ఆరాధించే సమాజంలోనే
సరికొత్త జీవశక్తి చేతులు చాచుకుంటూ
విస్తరిస్తుంది —

[2-7-91]

# నిజమైన దేవుళ్ళు

నేను చూసేది కుండీని కాదు
కుండీలోని పూలమొక్కనూ కాదు
పూలమొక్క చిగురుటాకులనూ కాదు
చిగురుటాకుల నడుమ చిక్కిన
చిన్నిపువ్వునూ కాదు
మొక్క మొదట్లో పట్టిన చీడను
తొలగించే వ్రేళ్ళను చూస్తున్నాను

నేను చూసేది గాలిపటాన్ని కాదు
గాలిపటాన్ని చూసి పిల్లలు కొట్టే
కేరింతలనూ కాదు
కేరింతలతో పిల్లలు వేసే చిందులనూ కాదు
పల్టీలు కొట్టకుండా చెట్లకొమ్మల చిక్కకుండా
నేర్పుగా దారాన్ని వదిలే వ్రేళ్ళను చూస్తున్నాను

నేను చూసేది ఆమెను కాదు
ఆమె అందాన్నీ కాదు
అందమైన పొడవాటి నల్లని కురులనూ కాదు
కురుల నడుమ బిగిసిన రిబ్బను ముక్కనూకాదు
ఆమె కంటి నీటి బిందువులను
ప్రేమతో తుడిచే వ్రేళ్ళను చూస్తున్నాను

నాకు తెలుసు, ఆ వ్రేళ్ళు
వేస్తాయి మమతానురాగాల పందిళ్ళు
నాకు తెలుసు, ఆవ్రేళ్ళు
నిర్మిస్తాయి సౌభ్రాతృత్వపు లోగిళ్ళు
నేను నమస్కరించే, ఆవ్రేళ్ళు
మన జాతిని రక్షించే నిజమైన 'దేవుళ్ళు'

[30-11-89]

# పుస్తకం నా ప్రాణం

పుస్తకం
పుస్తకం మాత్రమేకాదు
మస్తిష్క మహాసాగరాన్ని మథించే
మహోత్కృష్ట సాధనం
పుస్తకం
హస్తభూషణం కాదు
మానవ మేథలో మహత్తరామృతాన్ని
చిందించే ఆయుధం
పుస్తకం
సప్తస్వర సమ్మిళిత రాగ సుధారస మృదు
మంజుల మాధురీ గీతం
పుస్తకం
సలలిత సాహిత్య కళావికసిత మనోహర
సుశోభిత రూపం
పుస్తకం
ఇరుల కంతాల ఖండించు దీపకళిక
దివ్యఖడ్గ హస్తం
పుస్తకం
సకల సురుచిర సుందర పుష్ప సురభిళాయుత
విరాజిత వనం
నా దృష్టిలో పుస్తకం జీవిత ప్రతిబింబం
నా కంటికి పుస్తకం నిఖిల ప్రపంచం
నా మనసుకు పుస్తకం ఔషధ నిలయపర్వతం
అందుకే —
పుస్తకం నా ధ్యానం
పుస్తకం నా ప్రాణం
పుస్తకం నా నేస్తం
పుస్తకం నా సమస్తం.

[22-10-89]

# గమ్యం కోసం

ఆ దారి మీద
అడవులు మొలుస్తాయి
అసత్యపు ఆరోపణలు అల్లుకుపోతాయి
పల్లేరు కాయల ముళ్ళు
మట్టి రేణువుల్లో దాగుంటాయి
వాలిన రెప్పలు కళ్ళకు అడ్డేమీ కావు
మనో ప్రపంచానికి ఆంక్షలు కంచెలు కాలేవు
నినాదాలను నిషేధించినా
గుండె అండర్ గ్రౌండులో
గీతాలు ప్రవహిస్తూనే ఉంటాయి

ఆ దారి ...
ఆవలింతలు కరువైన అజ్ఞాతమవుతుంది
కనుల కర్టెనుల వెనుక కదులుతున్న
కలల అలలు ఘనీభవిస్తాయి
మనసు మాగ్మా అవుతుంది
దృశ్యం
హృదయాన్ని దూదిలా ఏకుతుంది
దుఃఖం
అనుభవాలను కన్నీటి బిందువులుగా కత్తిరిస్తుంది
ప్రయాణం వెలుతురు ముఖం
వైపుగా సాగేటప్పుడు
నీడలు ఊరేగింపు లేవదీస్తాయి
జాడలు మునుముందుకు నడిపిస్తాయి

ఊపిరి తిత్తుల గుహల్లో
ఎర్రగా చిక్కబడుతున్న ఊపిరులు
భవిష్యత్తు రూపాలకు ప్రాణవాయువులవుతాయి

ఆ ముళ్ళదారికి
ఆ చివరగా దూరంగా
వేల మెగావాట్ల శక్తితో మెరుస్తున్న గమ్యం
గెలిచినా ఓడినా
ఆడాలనుకున్నప్పుడు ఆడక తప్పదు
చేరినా చేరకపోయినా
ప్రయాణించవలసి వచ్చినప్పుడు
ప్రయాణమే శరణ్యం
శాంతివాహనమో
ఆయుధ శకటమో
గమ్యం కోసం ఏదో ఒకటి ఎక్కక తప్పదు !

[21-3-90]

## నాయకుడు

మాట
పువ్వు
మనసు
ముల్లు [1981]

# ట్రీట్‌మెంట్

పాటల్నెలా మీటగలవు పగిలిన పెదాలు
ఎంతకాలం నిరీక్షించగలవు తడిఆరిన కన్నులు
హరితరహితమైన భూమినుండి నడచివస్తున్న కళేబరాలెవరివి?
నదుల్లా ప్రవహించవలసిన హసాలు దుఃఖబిందువులై
నలిగి పోతున్నాయి
కిరణాల్లా ప్రసరించవలసిన చూపులు చేవరికం పీలికలై
వేలాడుతున్నాయి
గుండె గులాబీల అసలు ఆకారాలు ముళ్ళపెళ్ళలపై
రేకులై విడిపోతున్నాయి
సావాసాలు - సాహసాలు కూడ అపస్వరాల
కీర్తనల్ని ఆలపిస్తున్నాయి
స్పర్శలు కోల్పోయిన దేహాలు మృతానుభూతుల
పాటలపై యాత్రిస్తున్నాయి
స్వార్థ సర్పం బుసల వేడికి జీవితాలు ఊపిరాడక
తల్లడిల్లుతున్నాయి
క్షుద్రకాంక్షల కాటువేటుకు ప్రపంచం నురగలు కక్కుతోంది
మనిషనే వాడికెవడికైనా
కంట్లో కడివెడు స్వప్నాలుంటాయి - గుండెలో
పిడికెడు ఆశలుంటాయి
మనిషనే వాడెప్పుడూ నిటారుగా ఉండాలి
పిడికిళ్ళలో వ్యక్తిత్వాన్ని మోసుకుంటూ
బ్రతుకు సంద్రపు అలల్ని వెనక్కు నెట్టాలి
ప్రశ్నించే మనిషే ప్రాణసౌరభాల్ని పంచగలడు
సూర్యుడ్ని నింపుకున్న మనిషే చీకట్లను తొలగించగలడు
మనిషి మనిషిగా బతకడమే
ఈ హేయ వ్యవస్థకు నిజమైన నిఖార్సైన వైద్యం
మనిషిని కాపాడగలిగేదొక్కటే
అది మానవత్వాన్ని ప్రబోధించే కవితా సేద్యం. [4-6-90]

# దృశ్యాలు తరుముతున్నప్పుడు

కలల్ని గాలిపటంలా ఎగరేస్తున్నప్పుడు
ఊహల్ని ఫుట్‌బాల్లా తన్నుతున్నప్పుడు
బాధల్ని తలమీద కెత్తుకుని నడుస్తున్నప్పుడు
బరువుల్ని పళ్ళబిగువున మోస్తున్నప్పుడు
నేను నడిచేబాట పగిలినప్పుడు
నేను వ్రాసే పాట రగిలినప్పుడు
ఎద్దుతోక మెలితిప్పే చేతులు కత్తులైనప్పుడు
చేలో కలుపు పీకే చేతుల్లో కొరడాలు
మొలిచినప్పుడు
పశువుల్ని కడిగే చేతులు పంజాలైనప్పుడు
ఊపిరి ఆవిరైనప్పుడు
ఆవిరి చూపైనప్పుడు
చూపు కిరణమైనప్పుడు
కిరణం తరతరాల మందబుద్ధిని మండించినప్పుడు
కన్ను పుండైనప్పుడు
అశ్రువు గుండైనప్పుడు
యుగయుగాల వంచన దృశ్యాలు
తరుముతున్నప్పుడు
కన్నీటి కుండలు అగ్నిగుండాలైనప్పుడు
అప్పుడు —
అవినీతిని కుత్తుక బంటి మింగి
అజీర్ణం చేసిన
ఈ అస్తవ్యస్త వ్యవస్థ చీకటి కడుపులో
నిదానంగా కాకుండా
భళ్ళున తెల్లవారుతుంది.

[1984]

# శబ్దాల్ని ప్రేమిస్తూ

దీపాన్ని వెలిగించేముందు అగ్గిపుల్ల చేసే శబ్దంలో
నవ్యోజ్జ్వల చైతన్యపు కాంతి ఉంది
కంటి జీర ఎరుపెక్కేముందు ఊపిరిచేసే శబ్దంలో
మహోన్నత నవ్యప్రపంచపు రూపం ఉంది

ఎగిరే జెండా రెపరెపల శబ్దంలో
ఐకమత్యమనే అద్భుతాయుధం ఉంది
ఎగిరే గువ్వల రెక్కల టపటపల శబ్దంలో
శాంతి శస్త్రం ఇమిడి ఉంది

పక్షుల కిలకిల శబ్దాలు
ఉషోదయాగమన సూచికలు
నదీ ప్రవాహపు గలగల శబ్దాలు
నవనాగరికతా సంకేతాలు
కడుపు మండినప్పుడు వెలువడే
అకలి కేకల శబ్దాలు
ప్రపంచం నలుమూలలా ధ్వనిస్తాయి
కన్ను పగిలినప్పుడు జారే వేదనాశ్రు
బిందువుల శబ్దాలు
గుండె గుండెలో జ్వలిస్తాయి
మనసు రగిలినప్పుడు జీవితం అరణ్యమవుతుంది
అరణ్యం తుపాకీ పేలిన శబ్దమవుతుంది

పీడిత జన జీవన సాగర మథనోద్భవ శబ్దాలను
తల మీద కెత్తుకుని
అమాయక జన హృదయాంతరంగ
జ్వలిత శబ్దాలను

తనువెల్లా పఱచుకుని
భుగభుగల భగభగల నినాదాల శబ్దాలను
పిడికిళ్ళలో బిగించుకుని
సర్వమానవ శ్రేయోకాంక్షతో గమ్యంవైపు
సాగిపోతున్నా
శబ్దాల్ని ప్రేమిస్తూ ...!

[19-12-89]

## అంకితం

నా మనస్సరోవరంలో పూచిన ఈ తొలి పద్మాన్ని

మా అమ్మ

కీ. శే. భూనాగలక్ష్మి కి

ప్రేమతో భక్తితో...